# డాక్టర్ కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవ దృశ్యములు



కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టరు
శ్రీమతి కే. శారదాదేవి, గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత
శ్రీమతి కే. రామలక్ష్మిగార్లు ఆసీనులైయున్నారు.



శ్రీమతి కే. శారదాదేవిగారు సంస్థపరివారమునకు వస్త్ర ప్రదానము
చేయునప్పటి చిత్రము

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౯] మే 1957 [సంచిక ౫







# విషయసూచిక

—(౦)—





శ్రీమతి పి. సీతాలక్ష్మి

తెలుగు భాషా సమితివారు 1955_56 పోటీలో ఉత్తమ బాలసాహిత్యంగా నిర్ణయించిన 'పిల్లల నాటికలు' రచయిత్రికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము రు. 500/-లను బహుమతిగా నిచ్చెను.





గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదాన సందర్భమున శ్రీ సి. సి. పున్నయ్య స్వాగతము చెప్పచుండుట.



డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవ సందర్భమున శ్రీమతి కే. రామలక్ష్మికి
గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము జరిగినప్పటి చిత్రము.






జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

---

## జన్మదినము

పూజ్యబాబు కేసరిగారు పరమపదించి నాలుగుసంవత్సరములు నిండబోతున్నా ఆయన ఆదరాభిమానములకు పాత్రులై, సహాయసహకారములను పొందిన వ్యక్తులు, సంఘములు ఆయనపట్ల శ్రద్ధాభక్తులను వెల్లడించుటకనువైన దినం ఏప్రిల్ 26వ తేది.

ఆయనను పూజించి, సేవించి, ప్రేమించినవారు కొందరు; మరికొందరు ఆయన వదాన్యతను, సంఘసేవాసక్తిని, ఉదారహృదయమును వేనోళ్ల పొగడి ప్రజాహితమును ప్రోత్సహించుటలో ఆయన ఆదర్శప్రాయుడని జోహారులర్పించేవారు.

ఆయనను దాతయని మాత్రమనినచాలదు. ఆయన తలపెట్టిన దానధర్మములు తన యుద్దేశములు సఫలీకృతములు కాగలిగే పక్షంలోనే ముందంజవేసేవారు. ఆయన ప్రోత్సహించిన ప్రజాహితకార్యక్రమము, కళాపిపాసిగా, విద్యాభిమానిగా చూపిన ఆసక్తి ఫలప్రదం కావడం కనులార గాంచకలిగినధన్యజీవి.

ఇహంలో నిర్విరామంగా ప్రజాశ్రేయస్సును ప్రోత్సహించిన పూజ్యబాబు కేసరిగారికి యీ సందర్భమున సవినయంగా భక్త్యంజలి ఘటించుట మన ధర్మం.

# గృహలక్ష్మి స్వర్ణ కంకణ ప్రదానసందర్భమున

శ్రీ సి. సి. పున్నయ్య స్వాగత వచనములు

పూజ్యులారా!

పూజ్యులు కేసరిగారి జన్మదినము ఏటేటా మనకు పర్వదినములాంటిది. ఆయన వదాన్యత, ఉదారహృదయము, సంఘశ్రేయస్సుకు - ముఖ్యంగా మహిళాభ్యున్నతి పట్ల ఆయన చూపిన ఆసక్తి నలుముఖాల వినియోగపడింది.

గృహలక్ష్మి పత్రికను స్థాపించి తాము సంపాదకులుగా మహిళల విద్యావిజ్ఞానముల వ్యాప్తితోబాటు ఆరోగ్య సౌభాగ్యముల పెంపుకు సయితము చేసిన కృషి అపారము. స్త్రీలకు సాహిత్యం, లలితకళలు, సంఘసేవపట్ల ఆసక్తి పెరుగుటకనియే గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానమును 1934లో ప్రారంభించిరి. ఇప్పటివరకు 18 బహూకరించబడినవి. తన అనంతరము శాశ్వతముగా యీ గృహలక్ష్మి స్వర్ణ కంకణ ప్రదానము, కేసరికుటీరం ప్రైవేటు లిమిటెడు వారి పరివారమునకు అన్న వస్త్రప్రదానములు తమ జన్మదినంనాడు జరుగుటకుగాను నిధుల నేర్పరచినందులకు కృతజ్ఞతాపాత్రులు. వారి ఔదార్యము, విశాలదృక్పథం సర్వదా మార్గదర్శకం కాగలదని ఆశిస్తూ పూజ్యబాబుకు జోహారులర్పిస్తున్నాము.

# గృహలక్ష్మి స్వర్ణకంకణముల నందుకున్న మహిళలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ | 1934 | బాపట్ల |
| 2. | ,, చిల్కపాటి సీతాంబ | 1935 | నెల్లూరు |
| 3. | ,, కాంచనపల్లి కనకాంబ | 1936 | విజయవాడ |
| 4. | ,, పులవర్తి కమలాదేవి | 1937 | రాజమహేంద్రవరం |
| 5. | కుమారి రత్నాల కమలాబాయి | 1938 | మద్రాసు |
| | శ్రీమతి బాలాంత్రపు శేషమ్మ | ,, | |
| 6. | ,, చేబ్రోలు సరస్వతీదేవి | 1939 | |
| | ,, వి. రాధామణి | ,, | మద్రాసు |
| 7. | ,, బత్తుల కామాక్షమ్మ | 1941 | రాజమహేంద్రవరం |
| 8. | ,, ఊన్నవ లక్ష్మీబాయమ్మ | 1948 | గుంటూరు |

| | | | | |
|---|---|---|---|---|
| 9. | శ్రీమతి | బెంగుళూరు నాగరత్నమ్మ | 1949 | మద్రాసు |
| 10. | ,, | గంటి కృష్ణవేణమ్మ | 1950 | ప్రొద్దుటూరు |
| 11. | ,, | గిడుగు లక్ష్మీకాంతమ్మ | 1951 | మద్రాసు |
| 12. | ,, | స్థానాపతి రుక్మిణమ్మ | 1952 | విశాఖపట్టణం |
| 13. | ,, | ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ | 1953 | బాపట్ల |
| 14. | ,, | పోణకా కనకమ్మ | 1955 | నెల్లూరు |
| 15. | ,, | కొమ్మూరి పద్మావతిదేవి | 1956 | మద్రాసు |
| 16. | ,, | కే. రామలక్ష్మి | 1957 | మద్రాసు. |

# డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవము

## గృహలక్ష్మి స్వర్ణ కంకణ ప్రదానము

స్వర్గీయ డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవ సందర్భమున ఏప్రెలు నెల 26వ తేదిన మద్రాసు కేసరికుటీరమునందు సుప్రసిద్ధ రచయిత్రి, విదుషీమణి శ్రీమతి కే. రామలక్ష్మికి గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము, కేసరి కుటీరం పరివారమునకు అన్నవస్త్ర ప్రధానములు జరిగెను.

గృహలక్ష్మి సంపాదకులు శ్రీ సి. సి. పున్నయ్య ఉత్సవసమావేశములో స్వాగతము చెప్పుచూ యీ సంవత్సరమునకు శ్రీమతి రామలక్ష్మిని గృహలక్ష్మి కంకణ గృహీతగా ఎన్నుకొనుటకు ఆమె వైదుష్యము, రచనానైపుణ్యము, సారస్వత సేవ పట్లగల ఆసక్తి కారణములనిరి.

కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడు మేనేజింగ్ డైరెక్టరు శ్రీమతి కే. శారదాదేవి కంకణ ప్రదానము చేసిరి.

శ్రీమతి కే. రామలక్ష్మి కంకణమును స్వీకరించుచు తనకీ చిన్నతనంలోనే యీ సత్కారము జరుగుతున్నందుకు కృతజ్ఞతను తెలుపుతూ పూజ్యులు కేసరిగారి సంస్థలు అవిచ్ఛిన్నముగా వర్ధిల్లుగాక! యనిరి.

శ్రీ సి. సి. పున్నయ్య వందన సమర్పణముతో సభ ముగిసెను.

# యాదవవీర చరిత్ర

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు



(మార్చి సంచిక తరువాయి)

ప్రథమభాగములో తిక్కన కవి బ్రహ్మ కాలాన్ని నిర్ణయం చేయబోతూ, దానికి సహాయంగా ఖడ్గ తిక్కన కాలాన్ని, కాటమరాజు కథా కాలాన్ని చర్చించేరు. తిక్కన యొక్క మూడో పెద్దతండ్రి కొడుకు ఖడ్గతిక్కన అని తేల్చేరు. కాని వీరి నిర్ణయం సరియైనది కాకపోడానికి కొన్ని కారణాలున్నాయి. వీరేశలింగంగారు కేతనకవి కృతదశకుమారచరిత్ర ♦17 నుంచే ఖడ్గతిక్కనను పరిశోధించజూచేరు. *18 కేతనకవి తన గ్రంథంలో తిక్కన వంశంలోని పూర్వతరాలను పదింటిని తెలియజేసేరు. అతని వర్ణన పదకొండో తరం వాడైన కవిబ్రహ్మ తిక్కనతో ఆఖరు. ఈ తిక్కన తండ్రి పేరు కొమ్మన. వీరేశలింగంగారు ఈ కొమ్మన అయిదో తరంలో ఉన్న కొమ్మన అని గడిబిడి పడ్డారు. కాబట్టి పదో తరంలో చెప్పబడ్డ కొమ్మనను అయిదు తరాలముందుకి తీసుకుపోయేరు. ఆ కొమ్మన అన్నదమ్ములలో ఒకడైన సిద్ధనయొక్క కొడుకు ఖడ్గ తిక్కన అన్నారు. ఇది తప్పని తెలుస్తూంది. కాబట్టి వీరేశలింగంగారి నిర్ణయం సరికాదని చెప్పవచ్చు. కేతనకవి పదులకొద్దీ పేర్లను ఏకరువుపెట్టేడు. కాబట్టి వారిని గుర్తించడంలో పొరపాటుకి ఎంతో అవకాశముంది.

వీరేశలింగంగారు ఇటీవలి గ్రంథమైన "ఖడ్గతిక్కన చరిత్ర" †19 అను పద్యకావ్యంలోని పద్యాలను ఖడ్గ తిక్కన సంబంధాన్ని తెలియజేస్తూ ఉదహరించేరు. తిక్కన వంశాన్ని కొన్ని తబిసీళ్లతో వర్ణించిన దశకుమారచరిత్రనుంచే తెలియని అంశం ఇటీవలి గ్రంథం నుంచి తెలియడానికి సాధ్యంలేదు. ఇట్టి పొరపాటులను బట్టి ఆయన కాటమరాజు యుద్ధాన్ని గురించి చేసిన కాలనిర్ణయం సరిగాలేదు. మరికొందరు విమర్శకులు పడ్డ పొరపాటు అభిప్రాయానికి వీరేశలింగంగారి కాలనిర్ణయం గొంతవరకు కారణం అని చెప్పవచ్చు. ♦ 20

బటర్‌వర్తు, వేణుగోపాలశెట్టిగారు ప్రకటించిన నెల్లూరి మండలములోని శాసనవిషయం తెలియక పోవడంచేత వీరేశలింగంగారు 'పసులమేత బీళ్లపుల్లరి విషయమున జరిగిన జగడములో కాటమరాజువలెనె మనుమసిద్ధియు 1263వ సంవత్సర ప్రాంతమున రణనిహతుడయ్యెను' † 21 అని వ్రాసేరు. కాని ఇట్టి

♦ 17 కేతనకవి కృతదశకుమారచరిత్రను వావిళ్లవారు 1925 లో ప్రకటించేరు. దీని పీఠిక సరిగా లేదనీ పరిష్కరించవలసుందని పండితులు చెప్పుతారు.

* 18 ఆంధ్రకవులచరిత్ర 120-128 పుటలు.

† 19 ఆంధ్రకవులచరిత్ర పుటలు 94.97.

♦ 20 ఆంధ్రపత్రిక విజయసంవత్సరాది సంచికలో కాటమరాజు కథ అనువ్యాసం

† 21 ఆంధ్రకవులచరిత్ర, పుటలు 116, 95

అభిప్రాయం సరియైనది కాదని పై శాసనం తెలియ జేస్తూంది.

కాటమరాజు యుద్ధకాలాన్ని గురించి C. P. బ్రౌను దొర ఇప్పటికి సుమారు నూరేళ్ల క్రిందటె ప్రయత్నంచేసేడు. D 1034 & D 1031 లో బ్రౌను దొర ఇంగ్లీషులో వ్రాసినదానిని ఇక్కడ తర్జుమా చేస్తాను. "కాటమరాజు కవిత్వ పుస్తకంలో ఘటనలు భుజబలవీరనల్ల సిద్ధదేవచోర మహారాజు (ఈగంత ప్రభువు, ఏనుగంతపేరు) నెల్లూరును పరిపాలించేటప్పుడు జరిగేయి. ఇది శా. శ. 1087 లేక క్రీ. శ. 1157" బ్రౌనుదొర నెల్లూరును పాలించిన రాజు అని పేరు ఎట్లు తెలుసుకొన్నాడో మనకు తెలియదు. అతను చెప్పిన సంవత్సరం కూడ మిగత వాటికి సరిపోవడంలేదు. బ్రౌనుదొర D 1040 లో వ్రాసిన నోట్సులో లోకల్ రికార్డులో 'ఈ యుద్ధం క్రీ. శ. 1756 అని కొందరంటున్నారు. కాని అది అసందర్భం'అని ‡ 22 తెలియజేసేడు.

ఆ యుద్ధం జరిగిన దినం అంటూ పై శాసనం లోను, కాటమరాజు కథలోను కూడ చెప్పబడ్డ తిథులు (పుటలు 32, 122) సరియైనవి కావు అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కాటమరాజు కథా పీఠికలో చర్చించేరు. ఈ యుద్ధం మూడు నెలల ఇరవైయైదు రోజులు జరిగి ఉండవచ్చునని తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు వ్రాసేరు. ♦ 23

కాటమరాజు కథలో యుద్ధంచేసిన నల్లసిద్ధిరాజు మహామండలేశ్వరుడంటూ వర్ణించబడ్డాడు. కాటమరాజు కథలోని అతిశయోక్తులకు మితములేదంటూ వెనకే మనవిచేసేను.

కాటమరాజు కథలో యుద్ధంచేసిన నల్లసిద్ధిరాజు మహామండలేశ్వరుడంటూ వర్ణించబడ్డాడు. ఈ కథలో యుద్ధంచేసిన సిద్ధిరాజులు చాలమంది ఉన్నారు. ఎర సిద్ధిరాజు, బావసిద్ధిరాజు. కస్తూరి సిద్ధిరాజు, కొమర సిద్ధిరాజు మొదలైనవారున్నారు. ఈ పేరలలో ఎన్ని కల్పితమో పరిశోధనమీదకాని తేలదు.

ఈ యుద్ధం క్రీ. శ. 1195 ప్రాంతం : జరిగి ఉండవచ్చు ఇక్కడ మరొక చిత్రమేమంటె ఇంతకి కొంచెం ముందుగానె (క్రీ. శ. 1178-82) పల్నాటి వీరయుద్ధం జరిగింది. ఆ కాలంలో చిల్లరయుద్ధాలు రేగి దేశంలో అశాంతి కలిగించేవని చెప్పవచ్చు. క్రమంగా వృద్ధిపొందుతూన్న కాకతీయ రాజ్యం దేశమంతను స్వాధీనపరచుకొని ప్రశాంతతను చేకూర్చింది.

ఈ యుద్ధం సంగతి సమకాలిక గ్రంథాలలో కనబడదు. కొన్నికొన్ని చిన్న ఘటనలు ప్రజలదృష్టిలో క్రమంగా విస్తరిస్తాయి. మహాద్భుతమైన వాటిలాగు తయారవుతాయి. ఆ రకంలో చేరిన కథే ఇది. అందుచేత కాటమరాజు యుద్ధాన్నిగురించి సమకాలిక గ్రాంథికగ్రంథాలలో కనబడదు.

## కొన్ని జంగం కథా సంప్రదాయాలు

జంగం కథ కుండవలసిన సంప్రదాయాలు దీనిలో కొద్దిగానె కనబడుతున్నాయి. మహావీరులలో అతిలోక లక్షణాలు (Supernatural Powers) ఉన్నాయి. కైఫ్ యతులలోని కథలో బోగందాని కథ ఉంది కాని పినయెల్లన రచనలో మాత్రంలేదు.

సంఖ్యాసంప్రదాయం కొద్దిగాఉంది. ఏడు అంసకకు ఉదాహరణలు-ఏడురన్నదమ్ములు (పుట35) ఏడు సానల వెండినే జాలు (75) ఏడు తరముల పగలు నిచటం జేకూరె (101) చల్లవారు ఏడుగురు అన్నదమ్ములు (34).

పన్నెండు సంఖ్యకి నిదర్శనం-పన్నిద్దరు—దళవాయిలు (123).

‡ 22 భారతిమే 1953లో 435వ పుట

♦ 23 431

అద్భుతమైన గుర్రం స్థానాన్ని బొల్లావు ఆక్రమించుకొంది.

ఇట్లు జంగం కథాసంప్రదాయాలు కొంచెంగాని ఉండడానికి కారణం లేకపోలేదు. ఇవి 17,18వ శతాబ్దాలకి కొంత సన్నిగిలేయి. కాబట్టి కొందరు తక్కువగా అనుసరిస్తూ వచ్చేరు. పైగా ఈ కవి పల్నాటి వీరచరిత్రను ఒరవడిగా పెట్టుకొని కొంత స్వతంత్రతను పోగొట్టుకొన్నారు.

## వీరరస కావ్యం

పల్నాటి వీరచరిత్రవలెనె ఇదికూడ వీరరస కావ్యం. గోపాలురకు, రాచవీరులకు జరిగిన యుద్ధంలో కేవలం రాజకీయకారణాలె గాక మతంకూడ పని చేసింది. కాటమరాజు పక్షం వాడైన బ్రహ్మరుద్రయ్య ఖడ్గతిక్కనమీద తలపడ్డాడు. ఇద్దరూ మరణించేరు. బ్రహ్మరుద్రయ్య వీరపూజ అందుకొన్నాడు. ఇట్లే అనేకమంది వీరులు యుద్ధభూమిలో ఒరిగేరు. చల్లవారు అను యాదవ కులస్థులు చాల బలశాలులు. మహావిష్ణువు బొల్లావు రూపంగా వచ్చి యుద్ధంలో పాల్గొన్నాడుట! కాటమరాజు తాలూకు ఎద్దు, ఆవులు కూడ యుద్ధం చేసేయిట! జంగం కథలన్నిటిలాగె ఇదికూడ దుఃఖపూరితం. పైగా ఇది దుఃఖాంతం. రక్తం ఏరులై పారింది.

పాలేటి కెదిరించి పరగ దక్షిణము
పగవారి రక్తంబు పారుచుండంగ

అన్నాడు కవి.

## పాత్రలు

ఇందలి ప్రధానపాత్ర కాటమరాజు. కాబట్టి పుస్తకానికి ఆ పేరేవచ్చింది. యాదవుల పక్షాన యుద్ధాన్ని నడిపించినవారు ముగ్గురు వ్యక్తులు. పల్లికొండ, కాటమరాజు, పద్మనాయుడు, పల్లికొండ చెప్పినట్లె మిగతవారు చేసేరు. బీరన్న, ముమ్మడయ్య మొదలైన గొప్పయాదవ వీరులున్నారు. కవి ఈ కథనొక పురాణంలాగు వ్రాయదలపెట్టేడు. కాబట్టి వీరందరిని అద్భుతవ్యక్తులుగా చేసేడు. కాటమరాజు విష్ణువుయొక్క అవతారమట! బీరన్న జాంబవంతుని అవతారమట!

నల్లసిద్ధివైపు వారిలో ఖడ్గతిక్కన ఘనుడు. కొందరు సిద్ధిరాజాలే ఘనవీరులు. సంధ్యగోపాలుడు యుద్ధవీరుడు కాడు. గొప్ప జోతిష్కుడు. జరగబోయే సంగతులను ఏకరువుపెడతాడు. ఈ పాత్ర నిజమైన వ్యక్తి అగునో కాదో! * 24

ఈకథలో ఒక్క మనుష్యులే కాకుండా జంతువులు కూడ పాత్రవహించేయి. మహావిష్ణువు బొల్లావుగా ప్రవేశించేడు.' ఆవులు, ఎద్దు యుద్ధంలో పాల్గొన్నాయి. ఇట్లు కవి అద్భుత కల్పనను కథలో జోడించేడు.

## ప్రకృత్యతీతకల్పన; అతిశయోక్తులు

ఈ కథలో ప్రకృత్యతీతకల్పనకు (Supernatural) అతిశయోక్తులకు మితిలేదు. బొల్లావు మహావిష్ణువుయొక్క అవతారం! హనుమంతుడిలాగు తోకను ఉపయోగించింది. ఒంటి కొమ్ముగల ముసలి ఆవుగా మారి శత్రువుల సంహరించి, కనక రథం ఎక్కి స్వర్గానికి వెళ్ళింది. ఆవులు, ఎద్దు కలిసి శత్రువుల మీదికి దూకి యుద్ధంచేసేయి బీరన్నని ప్రార్థించగా కత్తి ఎగిరివచ్చి భుజంమీద వాలింది! ఉట్టి తలలు పలికేయి! ఖడ్గతిక్కన కండలు రక్తంమీద తేలి వచ్చేయి!

---

* 24 దాసరులు 'సందె గోపాలభిక్ష'చే జీవించిరి. సందెవేళలో గోపాల కీర్తనలతో ఇండ్లవద్ద భిక్షమెత్తుకొనుటకు సందె గోపాల మనిరి" అని ఆముక్తమాల్యదలో ఉందని సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర 269వ పుటలో ఉంది. ఈ సందె గోపాల పదమె గంగుల పినయెల్లయ్య కాలానికి (క్రీశ 1700) మానవాకృతి పొందిందా? సందె గోపాల, ముద్దుగోపాల అను తరగతికి చెందిన సందెగోపాల పదాలున్నాయా? దీనిని గురించి పరిశోధన అవసరం.

యుద్ధంలో మమ్మదయ్య చనిపోయేడు. అతని అల్లుడు పోచయ్య అతనికోసం వెతికేడు. కాని కన బడలేదు. అప్పుడు పోచయ్య 'వాల' అంటూ విచారించగా తిరిగి 'వాల' అని వినబడింది. ఈ మోస్తరుగా మామ కళేబరాన్ని పోల్చుకొన్నాడు. ఇట్టి చిత్ర కథలు ఇతరభాషలలో కూడ ఉన్నాయి. చోకమేళుడు అను మహారాష్ట్రభక్తుడు, మరి కొందరును కూడ కూలి చనిపోయేరు. అటు తర్వాత కొంత కాలానికి నామదేవుడు అను భక్తుడు విఠోబాదేవుని ఆజ్ఞమీద చోకమేళుని అస్థులను వెతక బూను కొన్నాడు. కాని లభ్యంకాలేదు. అంతట అతను నేలమీద చెవిని బెట్టి శోధించగా 'విఠోబా, విఠోబా' అను శబ్దం వినవచ్చింది. అప్పుడు అక్కడి ఎముకలను పోగుచేసేడు. ‡ 25

## కళ, రసం

కవి దీనినొక పురాణంగా చేయదలుచుకోడం బట్టి అనేక అద్భుతాల నన్నిటిని కల్పించేడు. దీని లోని కథ చాల చిన్నది. పల్నాటి వీరచరిత్రలో ఉన్నదానిలో మూడోవంతుకూడ ఉండదు. కాని కవి దీనిని పెద్ద కావ్యంగా రచించేడు. ఇదంతా కవియొక్క కల్పనాశక్తికి, వర్ణనాశక్తికి నిదర్శనం. యుద్ధవర్ణనలలో అతను అసామాన్య ప్రజ్ఞకలవాడు. ఈ కావ్యమంతా యుద్ధవర్ణనేనా అనిపిస్తుంది-వర్ణనా చాతుర్యం అంత ఘనమైనది. ఇట్టి వర్ణనలకు తగిన కారణంలేకపోలేదు. కథ జరిగి నాలుగువందలేళ్లు అయింది. తెలిసినంత తెలుసు, లేనంతలేదు. కాబట్టి యదార్థ చిత్రణకంటె వర్ణన మీదనె అధికంగా ఆధారపడవలసి వచ్చింది. బొల్లావు యుద్ధాన్ని పుటల కొద్దీ వర్ణించేడు. వీరరసవర్ణన లెన్నో ఉన్నాయి. బీరన్న తనను సంబోధించుకొంటూ చెప్పుకొన్న వాక్యాలు-"యమునిసన్నిధికి జీవాత్మ" మొదలుగాగలవి (86) వీరులకు యుద్ధమంటే ఒక ఆట అని తెలియజేస్తూ - "పరగదేహమే" మొదలుగాగల వాక్యాలు (120). "యుద్ధమంటె పెండ్లి వేడుక" అని వర్ణించే ఘట్టం (153). చాల అద్భుతంగా ఉన్నాయి.

కథలో వివిధ భాగాలు హెచ్చుతగ్గు లేకుండ ఉన్నాయి.

ఈ కవి కొత్త ఉపమానాలను సృష్టించేడు.

పెక్కు ముంగిసలతో పెద్ద శేషుండు (75)

జాతుపై నెగసేటి భైరవునివలెను

వంటివి చక్కగా ఉన్నాయి.

ఖడ్గతిక్కన్నకథ తాలూకు చాలు పద్యాలు దీనిలో ఇమిడ్చబడ్డాయి.

## జాతీయాలు, మాటలు

బలముల కల్లగా (పొడిగా) చంపుట, శత్రువులను ఆముకొనుట, నుగుభుగుల్ (24) కరణాల దేయూరు కయ్యమేయూరు (16) మొదలైన జాతీయాలు;

ఏర్ నిండి పారగా వెంపలిచెట్టు

పారకుండగ నాచి పట్టంగగలదె (15)

వంటి ప్రాపంచికోక్తులు, సలుగుపెద్దలు (122), ఘోరించుట, సెలకాల్వ (148), పరిణామము (క్షేమం), కాలారి (=హరాకారులు), మొదలైన మాండలిక పదాలు ఎన్నెన్నో ఉన్నాయి. ఆవుల పేర్లు ఎన్నో ఉన్నాయి.

ఆనాటి ఆయుధాలపేర్లు బోలెడన్ని ఉన్నాయి- సేజా, బల్లెం, బాణం, గద, సూర్యకటారి, వంకిణీ, చక్రము, కన్నెరాకమ్మ, దొనియుంటికోల (116), వజ్రాంగి, సురియ, చిల్లకోల, ఈటె, కత్తి, కుంతము, చంద్రవంక, గొడ్డలి, చేపట్టుకత్తి, భద్రగిరి ఈటె, భద్రాయుధం, ఇంద్రనీలపుకత్తి, ఇనపజీరా (150) చురకత్తి, జంజాళము, ఖండివాలము (153) వాణిజ, గదాశము (17) పొత్తిపుసేజా, మల్లెమొగ్గ (ఒక రకంబాణం), అరిగె (ఒక రకం తప్పెట అయుండ వచ్చు) వజ్రాంగి (=కవచము) (99) వంటివి యుద్ధసామగ్రికి సంబంధించినవి.

---

25 ‡ India's Untouchable Saints by K. V. Ramaswamy, G. A. Natesan & Co. Madras

# జర్మను

## కథలు, కబుర్లూ

'జర్మానంద'

### రొట్టెలో బైబిలు!

బొహిమియా ప్రాంతంలో ఒక జమీం దారు వుండేవాడు. వాళ్ల ఇంట్లో ఎంతో పురాతనమైన, అపరూపమైన వేదగ్రంథం వుండేది. ఆరు ఏడు తరాలనుంచి ఆజమీం దారు తాత, ముత్తాత వాళ్ల పూర్వులూ ఈ వేదగ్రంధాన్ని ఎంతో జాగ్రత్తతో పూజామందిరంలో దాచి వుంచారు. పూజా పునస్కారాలూ చేస్తూ ఆ గ్రంథం పట్ల భక్తి శ్రద్ధలను చూపెడుతూ వుండే వాళ్లు.

కాలం ఒకరీతిగా వుంటుందా? కొత్త రాజులు ఆ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నారు. వాళ్లమతం వేరు. వీళ్ళమతం వేరు. వాళ్లు దేశం ఆక్రమించుకున్నారో లేదో వీళ్ల మతగ్రంథాల మీదికి దాడి వెడలారు. ఎక్కడ అవి కనబడ్డాయో, వాటిని తగల బెట్టడం ఆ కొత్తరాజులకి పరిపాటి అయిపోయింది. ....

ఈ జమీందారు ఇంటిమీదికే వచ్చారు ఈ కాలాంతకులు. జమీందారు భార్య వాళ్లు అటు రావటం వంట ఇంట్లో నుంచి పసికట్టింది. అప్పుడే ఆవిడ ఆరోజు భోజనానికి కావాలసిన రొట్టెల్ని తయారు చేస్తూవుంది. వేదగ్రంథాన్ని పూజామందిరాన్నుంచి తెచ్చి దాని చుట్టూ పిండి పూసింది. రొట్టెగా తయారు చేసి అక్కడే వున్న పెద్ద బుట్టలో దానిని జాగ్రత్త పరచింది...

వాళ్ళు ఇంటిని ఎంతగాలించినా వేద గ్రంథం అగపడితేగా! విసికి వేసారివచ్చిన దోవనే మరికొంత సేపటికి వెళ్లాలసివచ్చింది. వాళ్లు ఆ దేశంలో ఏకచక్రాధిపత్యం చేస్తూవున్నంత కాలమూ, ఈ గ్రంథం అలా రక్షింపబడ్డది. కొంత కాలానికి వాళ్లని యుద్ధంలో ఓడించారు. వాళ్లు దేశాన్నుంచి వెళ్లిపోయాక, రొట్టెలో దాచి వుంచబడ్డ గ్రంధాన్ని పైకి దీసి, పూజామందిరంలోకి తెచ్చి ఎప్పటియట్లు పూజా పునస్కారాలు చేయటానికి ప్రారంభించారు ఆ ఇంటివాళ్లో...

# తెల్ల రోజా!

రచయిత్రి : ఇన్‌గే షోల్

అనుసరణ : డాక్టరు వి. ఎన్. శర్మ

[మొన్నటి ప్రపంచ సంగ్రామంలో జర్మను దేశపు పేరుప్రతిష్ఠలను నిలువబెట్టడానికి, సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించి, దానికోసం ప్రాణాలని సమర్పించిన విద్యార్థుల వీరగాథలని చిత్రిస్తుంది ఈ తెల్ల రోజా! ఈ ఉద్యమంలో పాల్గొన్నవారు ఆరుగురు. నలుగురు విద్యార్థులు. ఒక విద్యార్థిని. వాళ్ల ప్రొఫెసరూ. హాన్స్, సోఫీలకు ఈ వీరగాథని చిత్రించిన ఇన్‌గే షోల్ అక్క. ఇన్‌గే షోల్ తన తమ్ముడిని గురించి, చెల్లినిగురించి స్వయంగా తెలిసిన సంగతి, వాళ్ళ మిత్రులు చెప్పిన సంగతులనూ సేకరించి ఈ వీరగాథని వ్రాసి జర్మను యువక లోకానికి సమర్పించింది.]

## 1

ఆ యుద్ధపు రోజుల్లో హాన్స్, హాన్స్ చెల్లి సోఫీ మ్యూనిచ్ నగరంలోనే వుండిపోయారు. చలి కాలం. సాయంకాలమైంది. మామూలు ప్రకారం హాన్స్ ఇంటికి రాలేదు. అన్నకోసం చెల్లి ఎంతో ఆతృతతో ఎదురుచూస్తూవుంది. ఎంత ఎదురుచూస్తూ వున్నా హాన్స్ వస్తేగా! వాళ్లు బసచేస్తూవున్న ఇల్లు చాలా పెద్దది.

ఆ రోజుల్లో హాన్స్, సోఫీ తప్ప మరే నరపురుగూ అక్కడలేదు. బాంబు ఆ వర్షం మూలాన నగరంలో జనం చాలవరకు ఇళ్ళని ఖాళీ చేసి చుట్టు ప్రక్కల అడవుల్లో, కొండ లోయల్లో తల దాచుకొనటానికి వలస పోయింది. ఆ ఇంటి యజమాని, యజమాని కుటుంబమూ ఇలాగే పరాయి చోట్లకి వెళ్ళిపోయారు. అన్న ఎప్పుడు వస్తాడో? ఇంత ఆలస్యంగా ఇంటికిరావడం హాన్స్‌కి అలవాటు లేదే. వాళ్ళకి భోజనపదార్థాలు ఆ కష్టకాలంలో లభించటం కష్టమని తెలిసి కాబోలు అమ్మ వాళ్ళకి అవసరమైన పళ్ళని, రొట్టెలని, వెన్నని, జాం వగైరాలని జాగ్రత్తగా కట్టి పంపింది. ఆ సామాన్లని తీసి బల్లమీదసర్ది సోఫీ అన్నరాకకోసం ఎదురు చూస్తూ వుంది. హాన్స్ వచ్చినంతవరకు ఎలా భోంచేస్తుంది చెల్లి? ఎంత వేచివున్నా హాన్స్ వస్తేనా?

చీకటి పడుతూవుంది. ఇక ఆ చీకట్లో ఎలా వస్తాడు? ఈ రాత్రికి మరెవ్వరి బసలోనైన వుండి పోతాడా? అలావుండిపోదలిస్తే తనకు టెలిఫోను చేస్తాడే సాధారణంగా. కాని ఇవ్వాళ ఎందుకు అలా చేయలేదు?

టెలిఫోను పుచ్చుకుని తనకు తెలిసినవాళ్ళతో మాట్లాడుతేనో? ... అలా చేయటం మంచిదా? ఆ ఇంటిమీద పోలీసులు ఒక కన్ను వేసి వున్న సంగతి సోఫీకి తెలుసు. టెలిఫోనులో మాట్లాడేదానినంతా ఆ కాలాంతకులు వింటారు. అంచేత టెలిఫోను ముట్టుకోటం మంచిది కాదనుకుని తనలో తాను సమాధానపరచుకుని తిన్నగా బల్లదగ్గరికి వచ్చి కూచుంది. సోఫీకి చిత్రాలు గీయటమంటే సరదా. వూపిరిసలపనంత పని వున్నందున ఇంతకాలంనుంచి చిత్రించటానికి వీలుదొరికింది కాదు. చిన్నప్పుడు తను అమ్మ

దగ్గరా, ఇతర్ల దగ్గరా విన్నకథలనన్నిటినీ ఈ మధ్యనే పుస్తకరూపాన ప్రచురించాలనే కోరికతో వ్రాయటానికి ప్రారంభించింది. ప్రతికథకీ సరిపోయే చిత్రాలని కొన్నిటిని గీయాలని వుబలాటపడుతూ వుండేది. ఇప్పుడాపనికి అవకాశం దొరికింది. కాని ఎలాసాగుతుంది - సోఫీ మనస్సు హాన్స్‌కోసం అంత కుమిలి పోతూవుంటే! ఎంత గీసినా బొమ్మరూపం కాగితం మీద వస్తేనా! ... అర్ధరాత్రి అయింది. కాని హాన్స్ రాడాయె! ఎందుకు రావటంలేదు? ...ఎంత ఆలోచించినా దారీ తెన్నూ కనబడితేగా! బయట చీకటి; ఆ చీకటే సోఫీమనస్సును చెప్పరానంత బాధని పెడుతూవుంది. ... ఏమన్నా అవుతుందా? అయిందా ఇక అమ్మ ప్రాణంతో వుండగలుగుతుందా? నాన్న పడ్డ బాధలని చూస్తూ కృశించి పోతూవుంది అమ్మ. అలాటి యమయాతనలనే అన్న ఎదుర్కో నాలసి వస్తే - ఇంకేంవుంది? ......కళ్ళను గట్టిగా మూసుకుంది. తనతల్లి విగ్రహం ప్రత్యక్షం. ఎన్నెన్ని రూపాలతో అమ్మ తనకుకనబడటం? తన ముందు అలా నిర్ఘాంతపడి నిలుచుంది! కన్నీరు కారుస్తూ వుంది అమ్మ. ఆ దీనావస్థని చూస్తూ వుంటే హాన్స్‌కి ఏమైన అపాయం కలిగిందేమో! ఒక తన తల్లేనామరి? ఎంతో మంది మాతృదేవతలు తన దగ్గర నిలుచున్నారు. వాళ్ళ ముఖాలు ఎంత వెలవెలపోతూవున్నాయి! ఈ కాలంలో తల్లులు పడే కష్టాలు తనకు తెలుసు; అలాటి కష్టాలనే తన తల్లికూడా ఇక ఎదుర్కోనా లనీ వస్తుందా? ... ఇలా నెమరు లేస్తూవుంది.

సోఫీ ఆ నాటి రాత్రి తన విషాదావస్థను ఇలా తన డైరీలో వ్రాసుకున్నది; "ఇక లోకమే మునిగి పోతుందని ఈ కాలంలో పెద్దలు అనుకోటం నాకు బాగా తెలుసు. ఇలా అనుకోటం పిరికిమూలాన కాదు. భయం మూలాన కాదు. కాలం మనల్ని అటువంటి విషాద పరిస్థితులకు తీసుకునివచ్చింది. అంచేత ప్రతి వ్యక్తి ఈ విషయంలో తనకుగల బాధ్యతను క్షుణ్ణంగా అర్ధం చేసుకోనాలి ...... ఇవ్వాళవున్న నేను రేపు ప్రొద్దుటివరకు ప్రాణంతో వుండగలనా? ఈ రాత్రే బాంబులు అమాంతంగా ఈ ఇంటిమీద పడవచ్చు. అంతా నాశనం చేయవచ్చు. ఇలా ఇతర్లకు జరగటం నేను కళ్లార చూస్తూవున్నాను. అంచేత ఇలా ఇక్కడ జరిగినా జరగవచ్చు. అలాగే నక్షత్రాలు క్రింద పడిపోవచ్చు. భూమి కంపించవచ్చు. లోకం సర్వనాశనం కావచ్చు. అన్నిటికీ మనం సిద్ధంగా వుండి తీరాలిగా! ...... నిర్భయంగా అన్నిటినీ ఎదుర్కోనాలి...మనలో చాలమందికి, ముఖ్యంగా దైవచింతన పరులమనుకున్న వాళ్ళకి, భక్తులకూ, దేవుడంటే ఎంతో భయం. వాళ్ల దృష్టిలో దేవుడు అంటే ఎంతో అధికారాన్ని చెలాయించే శక్తి అని. ఆ పనికోసం కత్తికటారులతో జనాన్ని పాలిస్తూవుంటాడనీ – అంతేనా! రాత్రింబగళ్లు జనాన్ని తన అస్త్రశస్త్రాదులతో భయపెట్టుతూ వుంటాడనీ వీళ్ళంతా హడలిపోతూవుంటారు. మానవ కోటికి సంబంధించిన సర్వస్వం దేవుని చేతిలోనే వున్నదనే సంగతి నాకు తెలుసు. కాని ఆయన అంతకాలాంతకుడు కాడు జనకోటిని వుక్కిరిబిక్కిరి చేస్తూహడలగొట్టడానికి. మనమే అలా ఆయన్ని తలుస్తూ భయభ్రాంతులమై పోతూవున్నాము.-ఆయన యొక్క ఔదార్యాన్ని, మహాశక్తిని పూర్తిగామరచి పోతూవున్నాం అన్న మాట ... ...

సోఫీని ఈ సమయంలో ఇలా కలవరపరచటానికి కారణం ఒకటి వున్నదన్న సంగతి ఎలా మరచిపో గలుగుతాను? క్రిందటి రెండుమూడువారాల్లో జర్మను సేన స్టాలిన్‌గ్రాడ్ దగ్గర ఎలాటి నరకావస్థని అనుభవించాలసి వచ్చిందీ సోఫీకిబాగా తెలుసు. ఎంతసేన! ఎంతసేన! దాన్లోవున్న వాళ్ళంతా యువకులే! ఎన్నెన్నో ఆశయాలు గలవాళ్లు! నాశీల వుచ్చుల్లో పడిపోయినవాళ్లు! దేశపురోభివృద్ధికి వాళ్ళే జీవించేవుంటే, కాలచక్రం మరోదోవకి మనల్ని నడిపించుకొని పోయేది. అంత మంది ఆ పరాయి చోట హతమవటం అంటే ఇక దేశం కోలు కొంటుందా? అలా కోలుకోన్నా, ఎప్పుడులాగే మనల్నికూడావిధి ఏయేవిధంగా పరీక్షచేయ బోతూవుందో? మనం వుత్తదెబ్బల్ని తినటమే కాదు ... వాటికన్నా మించిన వున్మత్తావస్థలోకి దిగి

పోయాం. ఇక మనకు గతీమోక్షం అనేవి వుంటాయా? ఉన్నవే అనుకుందాం. వాటికోసం ముందంజవేసి, ఇతర్ల కందరికీ ఆదర్శమూర్తులయ్యే వాళ్ళు ఎవళ్ళు మరి? ......

ఇలా ఆలోచనా సముద్రంలో మునిగి తేలుతూ వున్న సమయాన, ఇంటి వెలుపల సందడి అయినట్లు గుర్తించింది సోఫీ. ఎవరు అలా సందడిచేయటం? ఆ నడక, హాన్సేదేకదూ! హాన్స్ వస్తున్నాడు. ఇక చీకటి ఎలా వుంటుంది? ......

తలుపు తెరిచింది సోఫీ. గబగబ లోపలికివస్తూ హాన్స్ చెల్లిని బుజ్జగిస్తూ "మేం చేసినపనివింటే నువ్వు స్తంభించిపోతావు చెల్లీ! రేపు ప్రొద్దున నువ్వు యూనివర్సిటీకి చేరుకోనటానికి లూడ్విగ్ వీధిగుండా నడుస్తూవుంటివా ఇండ్లగోడలమీద మేం చిత్రించిన "హిట్లర్ నాశనం కావాలి" అనే వాక్యాలను చూసి ఆశ్చర్యపడాలసి వస్తుంది." అని అన్నాడు.

హాన్స్ లోపలికి అడుగుపెట్టిన మరో నిమిషానికి అలెగ్జాండర్ కూడా అక్కడ ప్రత్యక్షమయ్యాడు. అలెగ్జాండర్ సోఫీకేసి మందహాసంచేస్తూ చూస్తూ 'అక్షరాలను ఏమాత్రం చెరిగిపోనీయకుండారంగులతో రాశాం. తుడిచివేయటంకూడా అంత సులభమైన పని కాదు' మెల్లగా అన్నాడు. మరికొంత సేపటికి విల్లీకూడా వచ్చాడు. అంత అర్ధరాత్రి సమయాన, సోఫీ అంత ఆతృతతో ఒంటరిగావున్న సమయాన, వాళ్ళ స్నేహితులంతా అలా రావటం సోఫీకి పెద్ద పండుగకిమల్లెవుంది. అమ్మ పంపిన భోజనపదార్థాలతో నిజంగా ఆ సమయాన పెద్ద పబ్బం చేసుకున్న దని ఇక మాటలతో చెప్పాలా! ...

మిత్రులంతా కాఫీ పుచ్చుకుంటూ, పళ్ళని, రొట్టిని తింటూ వాళ్లు ఆ రోజున చేసిన కార్యకలాపానంతా చెప్పటానికి ప్రారంభించారు. వాళ్లు చేసినపని సామాన్యమైందా? ఎంత సాహసం వుండాలి? దాన్నే గూఢచారులు పసిబట్టారా, ఎలాటివుచ్చుల్లో వాళ్లు పడాలసివస్తుందో వాళ్ళకి బాగా తెలుసు....

## 2

తెల్లవారింది. సోఫీ కాలోచిత కృత్యాలను తీర్చుకున్నాక, యూనివర్సిటీకి వెళ్ళడానికి ఇంటి నుంచి బయలుదేరింది. వెళ్ళాలసిన మార్గం లూడ్విగ్ రోడ్ లో నుంచే! దోవకి ఇరు ప్రక్కలనున్న ఇండ్ల గోడలమీద "హిట్లర్ నాశనం కావాలి. ... నాశనం అయితేనేగాని దేశం గట్టెక్కలేదు" అనే పదాలే స్పష్టంగా కనబడటం. మంచి మంచి రంగులనువాడి వుండాన్న ఆ అక్షరాలు వచ్చేవాళ్ళకి, వెళ్ళే వాళ్ళకి అంత స్పష్టంగా అగపడటానికి! ... ఒక ప్రక్క జనం వేలం వెర్రిగా వాటికేసిచూడటం ... ఇంకొక ప్రక్క పనిమనుషులు బ్రష్‌లు పుచ్చుకుని ఆ వ్రాతని బరబర చెరపటం! ఎంత చెరపినా అవి పోతేనా! ... పోలీసులు వచ్చారు. జైళ్ళలోనుంచి ఖైదీలను వెంట దెచ్చారు ఆ బ్రహ్మవ్రాతను చెరపివేయించటానికి ... కాని ఏం లాభం! ...

ఈ దృశ్యాల్ని చూస్తూ సోఫీ తిన్నగా యూనివర్సిటీ భవనాల్ని చేరుకుంటూవుంది. అదే సమయాన ఇలాటి దృశ్యాలనే దేశంలోవున్న ప్రతి యూనివర్సిటీ నగరంలోకూడా విద్యార్థి లోకం ఒకవైపూ, సామాన్యజనం మరోవైపూ కళ్ళార చూస్తూనే వుంటుంది కదూ! ఈ కార్యకలాపంలో హాన్స్ అన్నకు మల్లె, హాన్స్ స్నేహితులు అలెగ్జాండర్, క్రిస్టల్, విల్లీకి మల్లె తనకూ ఇంతో అంతో బాధ్యత వున్నదనే సంగతి సోఫీ ఆ సమయాన ఎలా మరచిపోగలుగుతుంది? ఇంతవరకూ బుర్రల్లోవున్న ఆలోచనలు ఇలా క్రియారూపం దాల్చటమంటే ఎంత గర్వపడాలోఇక చెప్పాలా! వాళ్ళ కృషి ఫలించింది. బండి ఒకసారి కదలటానికి మొదలెట్టిందా ... ఇక దానిని ఆపటానికి మనుష్య మాత్రులకు తరమవుతుందా? ప్రయాణంసులభసాధ్యమైనపని కాదు. ఇటూ గోయి, అటూ నూయి. కాని ప్రయాణాన్ని యథాతథంగా సాధించటానికి హాన్సు, అతని స్నేహితులు ముందంజవేశారు. అంతేనా! వాళ్ల ప్రొఫెసర్ ఇందులో వాళ్ళకిచ్చిన ప్రోత్సాహం వాళ్లు ఎలా మరచిపో

గలుగుతారు? ఆ ప్రోత్సాహం వుత్త మాటలతో కాదు, ఆయనే స్వయంగా కొన్ని కరపత్రాలని వ్రాసి వాళ్ళ కిచ్చాడు. ఆయన వాటిని అచ్చువేయటంలో వాళ్ళకు శాయశక్తులా సహాయం చేశాడు. గోడలమీద ఎలాటి వాక్యాలను వ్రాస్తే, అవి జనాన్ని ఆకర్షించగలవో ప్రొఫెసరుకి బాగా తెలుసు. అలాటి పదాలని సమకూర్చటమే కాదు. వాటిని గోడలమీద రంగులతో వ్రాసేటప్పుడూ ఆయన చేయాలసిన కాయకష్టాన్ని చేసి వాళ్ళకు ఇలాటి విషయాల్లో ఆదర్శమూర్తి అయ్యాడు....—

చీకటినుంచి దేశీయులు, ముఖ్యంగా విద్యార్థి లోకం వెలుగులోకి సాహసించిరావాలి. అలా వచ్చారా వాళ్ల దేశానికి విముక్తి సత్వరంగా వస్తున్నదే అన్నమాట. ...

ఇలాటి కార్యకలాపం నిప్పుతో చెలగాటం వంటిది. వెయ్యికళ్లతో ఈ పనిని సాధించాలి. అలా సాధించటంలో ఎంత మెలకువతో వుండాలో ఇక చెప్పాలా! ఇంట్లో గూఢచారులు, బయట గూఢచారులు. వాళ్లకూ వెయ్యికళ్లు వున్నాయి. చెప్పరానన్ని చెవులూ వున్నాయి. రవికానని చోటును పత్తాపట్టటానికీ ఆ గూఢచారులకు వున్నంత శక్తి సామర్థ్యాలూ, యంత్రసాధనమూ, మరే దేశంలో కలికానికైన కనబడటం దుర్లభం. ...

పోలీసులు కొంతకాలానికి ఈ యుద్యమానికంతా నాయకులు ఎవళ్ళో పసికట్టకలిగారు. ఆ సంగతి హాన్స్ ఆత్మమిత్రులలో నొకరికి తెలిసింది. హాన్స్‌కు వార్నింగ్ ఇచ్చాడు. ఆ పనినుంచి విరమించుకోనడమే సర్వోత్తమమని బతిమాలుకున్నాడు. పోలీసులకు దయాదాక్షిణ్యాలు అనేవి వుండవు. వాళ్లు ఏమిచేసినా చేయగలరు. ... హాన్స్ పప్పులో కాలు వేశాడా_ఇంకేముంది ప్రమాదం, ఉపద్రవం. దీన్ని హాన్స్ తెలుసుకోనాలని ఆ మిత్రుడు నయాన భయాన అన్నాడు. ...

మరో మిత్రుడూ ఇలాటి సలహానే ఇచ్చాడు. హాన్స్ ఇలాటి విషయాల్లోనుంచి వెంటనే బయటికి రాకపోయాడా, పోలీసులు అతన్ని రెండు మూడు రోజుల్లోనే అరెస్టు చేస్తారనీ, తరువాత ఏమనుకున్నా ఏంలాభంవుండదనీ అన్నాడు.

హాన్స్‌కు ఎంతోమంది ఆప్తులున్నారు. వాళ్లు చెప్పేదంతా తన క్షేమంకోరకేగా! అయినా తను ప్రారంభించిన పనిని ఎలా చప్పున నిలుపగలుగుతాడు? కరపత్రాలు తయారైనవి. కాపీలను తయారుచేయటానికి తనూ, తన మిత్రులూ ఇంతకాలంనుంచి చేస్తూవున్న పరిశ్రమను తలుస్తూవుంటేనా! ... ఆ పని నిజంగా సాహసమైన పనే! వాళ్లు తయారుచేసిన కరపత్రాలు అప్పటికే ఈ దేశంలోనేకాక, విదేశాల్లోకూడా ప్రచారంలో నున్నాయి. అందరూ వాటినే చదువుతూ వుంటారు ఆసక్తితో, వుత్సాహంతో. ముందు ముందు చేయాలసిన కార్యకలాపాల్ని మననంచేస్తూవుంటారు. ఆ పని నిప్పుతో చెలగాటం వంటిదే. నిప్పు భగభగ మండుతూ వున్నది. ఇక దానిని ఆపటానికి మన తేరమా? చావాలసి వస్తే దాన్లోనే చావాలి. దోవ నిచ్చిందా దాన్లోనుంచే అదురూ బెదురూ లేకుండా నడుస్తూ ముందుకు గబగబ నడిచిపోతూ వుండాలి. ఇదంతా ఒక వ్యక్తికి సంబంధించింది కాదు. దేశానికి సంబంధించింది. దేశం కీర్తి ప్రతిష్ఠలను నిలువబెట్టడానికి ప్రారంభింపబడ్డపని ఇదే. ...

అటువంటి పరిస్థితుల్లో పోలీసులు తనను పసికట్టారని, వాళ్ల వుచ్చుల్లోపడకుండా తప్పుకోటానికి అజ్ఞాతవాసంలో వుండిపోవటమా! లేక చప్పు చప్పున ఈ దేశాన్నుంచే పారిపోవటమా! ... పిరికి పందలు అలా చేయవచ్చు. అలా చేసినా ప్రాణాల్ని రక్షించుకోవచ్చు. పరాయి దేశాల్లో హాయిగా కాలక్షేపం చేయవచ్చు. ...

కాని తనా అలాటిపనిచేయటం? తన మిత్రుల్ని నిప్పుల్లోకి త్రోసివేసి తను తప్పుకోటమా? తనే పారేపోయాడనుకుందాం? ఇక వాళ్ళగతి ఏమవుతుందో తనకు స్పష్టంగా తెలుసుకదూ! పోలీసులు కాలాంతకులు. ఆవులిస్తే పేగుల్ని సులభంగా లెక్క—

పెట్టేశక్తి సామర్థ్యాలు వాళ్లకు వున్నాయి. ఇలాటి పనులలో సాహసించి దిగి రాత్రింబగళ్ళు సేవచేస్తున్న యువకుల నందరినీ, ఏమాత్రం దయాదాక్షిణ్యాలను చూపకుండానే ఎక్కడవాళ్లకంటబడితే అక్కడే అరెస్టుచేస్తారు. ఇలాటి "అపరాధాల"ను విచారించటానికి ఆ రోజుల్లో ప్రభుత్వం ఏర్పాటుచేసిన న్యాయస్థానాలకి వాళ్ళని తీసుకునివస్తారు. న్యాయమూర్తులు పోలీసువాళ్లే అదుపాజ్ఞల్లో వున్నవారే. అంచేత పనినంతా సవ్యంగా చేశారని లోకం నమ్మేటందుకుగాను నామకార్థం కొంత తతంగాన్ని సాగిస్తారు. అదంతా జైలు ఆవరణంలోనో, కాకపోతే ప్రత్యేకంగా ఇలాటి విచారణలలో పాల్గొనేందుకుగాను పిలిపించబడ్డవాళ్ల సమక్షానో, ప్రభుత్వం అలాటి నేరాలకుగాను తయారుచేసిన చట్టంప్రకారం చేసిశిక్షను విధిస్తాయి ఈ కోర్టులు. నూటికి తొంబయి వంతులు ఇలాటి నేరాలకు శిక్ష వురిశిక్ష. కోర్టువారికి ఏరూపాననైనా కనికరం అనేది, అలాటి సమయాల్లో కలిగిందా, వురిశిక్షకు బదులు యావజ్జీవమూ జైళ్లలో యమయాతనల ననుభవించాలసి వస్తుంది. అలాటి తీర్పులకు అపీలు అనేది వుండదు. అధవా ముద్దాయిలు అపీలు చేసుకున్నారా, వాళ్ళు తరువాత అనుభవించాలసిన నరకం సంగతి మాటలతో ఎలా చెప్పగలుగుతాను? ...

### 3

అంచేత హాన్స్ తన ధర్మపథంనుంచి వెనుకంజ వేసినవాడుకాదు. పగటిపూట యూనివర్సిటీలో వుపన్యాసాలకు వెళ్ళటం: ఆస్పత్రుల్లో రోగులకు పరిచర్య చేస్తూవుండటం. చీకటిపడ్డదా తిన్నగా ఇంటికి రావటం, మిత్రులతో ఆ రాత్రి సరిపెట్టుకోవాలసిన కార్యకలాపాన్ని గురించి సంప్రదించటం, వాళ్లతో కలిసి రాత్రి అంతా డూప్లికేటు మిషనుమీద వందలకొలది, అంతేనా — వేలకొలది కరపత్రాలను అచ్చువేయటం, అచ్చుపడ్డకరపత్రాలను తన పంథాలో ప్యాకుచేసి, పంపవలసిన చోట్లకు, ఇతర్ల కంటపడనీయకుండా పంపటం ... ఇదే అతను చేస్తూవున్న పని; హాన్స మిత్రుల కార్యకలాపమంతా ఇదే....

స్టాలిన్‌గ్రాడ్ దగ్గర జర్మను సేనలు ఎంత హోరాహోరిగా పోరాడుతూవున్నా - జయం తమదే అని లోకానికి ఎంత వుద్రేకంతో చాటుతూవున్నా - చుక్కవాళ్లకు ఎదురై పోయింది. లక్షలకొలది అక్కడ అగ్నివాతకు లోనుకావలసివచ్చింది. మిగిలిన వారు - వాళ్ళ సంఖ్య ఏ వేయికో మించివుండదు - కాళ్ళకు బుద్ధి చెప్పకుని ఇండ్లముఖం పట్టాలసి వచ్చింది. దోవలో వాళ్ళు ఎదుర్కోవాలసి వచ్చిన బాధలని వింటేనా ఎలాటి నిబ్బరపు మనిషిఅయినా హడలి పోవాలసివస్తుంది ........ ఈ సంగతి క్రమేణా దేశంలో ప్రజాకోటికి తెలియవచ్చింది. దాంతో కాగితాలతో నిర్మింపబడ్డ పేకలగోపురం అమాంతంగా కూలబడ్డదే అని చెప్పవచ్చు. ఎచ్చట చూసిన అలజడి, అసంతృప్తి. ప్రజల కీర్తిప్రతిష్ఠలను ఇలా అధ్వాన్నం చేసిన ప్రభుత్వంమీద, అబద్ధపు ప్రచారంతో యుద్ధాన్ని నడుపుతూవున్న హిట్లరు ముఠామీద పిచ్చికోపం. ధైర్యం సడలినదే అని చెప్పవచ్చు. ఈ పాడు యుద్ధ పిశాచంనుంచి ఎప్పుడు విముక్తి వస్తుందా అనే ఆశ ప్రజలలో పెచ్చుపెరగ సాగింది. ఈ వాతావరణంలో హాన్స్ తన పనిని చక్కగా చేయసాగాడు. కొత్తవాతావరణమూ దీనికి ఎంతో సహాయపడ్డదని చెప్పటం అనవసరం కదూ!

### 4

ఆ రోజు లక్ష్మీవారము. 1943 సం|| ఫిబ్రవరి 18వ తేదీ. చలికాలపు రోజులయినా ఆరోజు వుదయాన ఎండ బాగా కాస్తూవుంది. రాత్రి హాన్స్ తయారుచేసిన కరపత్రాలలో చాలాభాగం పై వూళ్ళకు పంపబడ్డవి. మిగతా భాగాన్ని హాన్స్, సోఫీలు సంప్రదించుకుని, ఆరోజు వుదయాన యూనివర్సిటీలో పంచిపెట్టటానికి నిశ్చయించుకున్నారు. సోఫీ ఆ కరపత్రాలని తన సూటుకేసులో (వాళ్ళు పుస్తకాలని క్లాసులకు తీసుకుని వెళ్లడానికి వాళ్లు సూటుకేసులను వుపయోగించుకొనటం పరిపాటి) జాగ్రత్తపరచింది. ఆ రాత్రే సోఫీకి ఒక కలవచ్చింది.

తను సూటుకేసులో కరపత్రాలని దాచి క్లాసులోకి తెచ్చినట్లు, హాన్సూ తనూ కలిసి వాటిని క్లాసులో ఇతర విద్యార్థులకు పంచిపెట్టినట్లూ, సి. ఐ. డీలు ఈ తంతునంతా వాళ్ళ పంథాలో పసికట్టి, అన్ననూ, తననీ అరెస్టు చేసినట్లు కలగన్నది. ఈ కాగితాలను సూటుకేసులో ప్యాకుచేస్తూ వున్నప్పుడు సోఫీకి ఆకల జ్ఞాపకం వచ్చింది. కాని అది కలేగా! దాని కోసం కంగారు పడటం ఎందుకు అని గుండెనిబ్బరం చేసుకున్నది. భోజనం ముగించుకుని అన్నా, చెల్లీ గబగబ, సూటుకేసుని పుచ్చుకుని ఇంటినుంచి బయలు దేరారు.

వాళ్ళిద్దరూ ఇంటినుంచి బయలుదేరిన మరో క్షణానికి వాళ్ల స్నేహితుడొకడు వాళ్ళ బసకువచ్చి తలుపుతట్టాడు. అతిముఖ్యమైన వార్తను వాళ్ళకు చెప్పాలని అతని వుద్దేశము. ఎంతసేపు తలుపుతట్టినా లోపలినుంచి జవాబువస్తేగా! ... ఇంటిముందు ఎంతసేపో వేచివున్నాడు. అతను వచ్చిన సంగతి వాళ్ళకి తెలిసివుంటే అతను చెప్పదలచుకున్న సంగతి వాళ్లే వినేవుంటే ...... చక్రం మరోదోవలో కదలి వుండేది. కాని కాలచక్రపు తంతు మనకు ఎలా తెలుస్తుంది? అధవా తెలిసినా, దానిదోవను మార్చటానికి మనకంత అదృష్టం వుంటుందా ?...

హాన్స్, సోఫీ యూనివర్సిటీ భవనాల దగ్గరికి చేరుకున్నారు. వాళ్ళ క్లాసు గదులు అప్పుడే తెరువబడ్డాయి. పాఠాలు ప్రారంభమవటానికి కొంచెం వ్యవధివుంది. ఈ లోపునే వాళ్ళు చేయాలసినపనినంతా చడీ చప్పుడూ లేకుండాచేయాలని అనుకున్నారు. సూట్‌కేసులోని కాగితాలని ఆ విద్యార్థుల బల్లమీదా, ఈ విద్యార్థుల బల్లమీదా ప్రొఫెసర్ల బల్లమీదా అమర్చారు. మిగిలి పోయిన కాగితాలని కారిడోర్లలో అటునడిచేవాళ్లు తీసుకొనటానికి పడేశారు ... సూట్‌కేసు ఖాళీ అయ్యాక కొంచెంసేపు బయటికి వెళ్ళి గంట కొట్టే సమయానికి లోనికిరావడం మంచిదనుకుని బయటి ప్రక్కనున్న తోటలో కొంచెం పచారుచేయాలని నిశ్చయించారు.

గేటు దగ్గర కూచున్న కాపలామనిషి వీళ్ళ వాలకాన్ని చూసి ఏదో పసికట్టాడు. గేట్లని చప్పున మూసేశాడు. పోలీసు అధికార్లకు అప్పటాన టెలిఫోను చేశాడు .........

పోలీసులు వచ్చారు. హాన్సుని, సోఫీని మరేమీ ప్రశ్నించకుండా అరెస్టు చేశారు. క్లాసురూముల్లో కనబడిన కాగితాలని స్వాధీనం చేసుకున్నారు. అంతా ఒక్కనిమిషంలో జరిగిపోయింది.

ఆ రోజుల్లో నరక లోకానికన్నా మించిపోయిందని ప్రఖ్యాతిగాంచిన విటల్‌బాక్ పోలీసు ప్రధాన కార్యాలయానికి హాన్స్‌ని, సోఫీని తీసుకొని వెళ్లారు ......

## 5

పోలీసువాళ్ళకు కావలసిన సాక్ష్యం వీళ్ళమీద నేరాన్ని ధృవపరచటానికి మాత్రంకాదు. ఆ కార్యకలాపానికి సంబంధించిన ముఠానంతటిని పూడల గొట్టడానికి. వాళ్ళ ప్లాన్లనుకూకటి వేళ్ళతో పెల్లగించివేయటానికి. దీనికిగాను వాఙ్మూలం సేకరించటం అనే తతంగం ప్రారంభమైంది. పగటిపూట హాన్స్, సోఫీ ఇన్‌స్పెక్టరు విచారణగదిలో హాజరుకావాలి అంతేనా? రాత్రంతా అక్కడే గడపాలి. ఆ సందర్భాన పోలీసులు వాళ్ళకి పెట్టిన బాధలను వింటేనా ఎటువంటి నిబ్బరపుమనిషి అయినా పిచ్చెత్తిపోవాలసి వుంటుంది! కాని వాళ్ళు వాళ్ళ హృదయాల్లోవున్న రహస్యాలను బయలుపరిస్తేకదూ! ... కాని పోలీసులు కాలాంతకులు. వాళ్ళు రహస్యాన్ని చెప్పకపోతేనేం - వాళ్ళ స్నేహితులు ఎవళ్ళో పోలీసులకి తెలియకుంటేకదూ! ఆ ముఠాకు సంబంధించిన వాళ్ళ నందరినీ ఆ రోజునే, అరెస్టుచేశారు. వాళ్ళకు పెట్టాలసిన బాధలని పెట్టటంలో ఏ మాత్రం వెనుక దీసినవాళ్ళు కాదు.

*

అందరినీ ఆ పోలీసు కార్యాలయానికి చేరువలోనేవున్న జైలులోవుంచారు. అందరినీ ఒకే చోట వుంచితే పోలీసు కార్యకలాపం యథాతథంగా

జరగదని తలంచి కాబోలు విద్యార్థుల నందరిని వేరు వేరు గదుల్లో బంధించారు. ఒక విద్యార్థులేనా! వాళ్ళ ప్రొఫెసర్‌నుకూడా అరెస్టుచేసి యీ జైలులోకే తీసుకొనివచ్చారు. ఒకర్ని ఒకరు కలుసుకొనటానికి వీలులేదు. పోలీసులకి కావలసిన భోగట్టాకోసం ఆధునిక శిక్షాసాధనాలనన్నిటిని తటపటాయించక వినియోగించారు... చేసిన 'రాజ' ద్రోహాన్ని అంగీకరించాలి! వాళ్ళ భవిష్యత్తుకోసం దీనిని ఒప్పుకొనటం శ్రేయోదాయకంకూడా! వాళ్ళే అలా చేశారా జైల్లో ఇక ఈ యమబాధలను అనుభవించకుండా బయట పడవచ్చునని ఆశలను కలిపించారు పోలీసులు. ప్రభుత్వం వాళ్ళతప్పుల్ని క్షమించి వాళ్ళకి మంచి వుద్యోగాలనిస్తుంది. పుష్కలంగా డబ్బువుంటుంది. అధికారాన్ని చెలాయించవచ్చు. పేరు ప్రతిష్ఠలకు, డాబు దర్పాలకి ఇంతకన్నా మరేంకావాలి! ... ఇలాటివాటిని, ఎన్నెన్నిటినో పోలీసులు ఆశ పెట్టారు. కాని యిలాటి ఆశలకు వాటికి సంబంధించిన తతంగాలకి లోబడే ఘటాలు అయితేగా హాన్స్, సోఫీ. వాళ్ళ స్నేహితులు, క్రిస్టల్, విల్లి, అలెగ్జాండర్. అటువంటివారేకూడా! వాళ్ళప్రొఫెసర్ హ్యూబర్, ఆయనభార్య ససేమిరా దీనికి ఒప్పుకొన్నారు గాదు. ఎలాటి శిక్షను దీనికోసం విధించినా సంతోషపూర్వకంగా అంగీకరించటానికి సిద్ధంగా వున్నారు ఈ త్యాగమూర్తులు. చావాలసివచ్చిందా-దానికీ తయారే. తమ చావు మూలాన ఇతర్లు కుదటబడుతారు. దేశపు కీర్తి ప్రతిష్ఠలను నిలుపుకోగలుగుతారు. జాతిని అధఃపాతంనుంచి పైకి లేవదీసి రక్షించగలుగుతారు. వాళ్ళ పూర్వులు ఈ ధర్మపథాననడిచి దేశపు కీర్తిని నిలువబెట్టారు. వాళ్ళూ ఈ పనికి ముందంజ వేసింది. అధర్మపథాన నడుస్తూ పావనంకావటానికేగా!

---

# ఆనందసుధ

కవయిత్రీ తిలక శ్రీమతి వసంతాదేవి

పరమ రక్తిని నీవు నాపజ్జ జేరి – నెమ్మొగమ్మున నేత్రముల్ నిలిపినంత
పులకరింపులు నిలు వెల్ల తొలకరింప – విస్మరించెద ప్రియతమా, విశ్వ మెల్ల!

ఎదురుగా నేగుదెంచి సౌహార్దముతోడ – పలుకు తేనియ నొక్కింత చిలికినంత
రాగ రత్నాకరమ్ములో నూగులాడు – బుద్ధి కానందశాంతి ప్రబోధ మగును.

చిరునగవుతోడ నీవు నాశిరముపైన – హస్త మిడినంతనే హృదయాంతరమున
ఝల్లు రనుచు చైతన్యప్రసార మెలసి – దిక్కు లన్నియు నేకమై తేజరిల్లు.

ఆదరమ్మున ప్రియతమా, అస్మదీయ – పాణి గ్రహియించినంతనే పరవశతను
భూరి చైతన్య వాహినుల్ పొంగిపోవ-అమర రాగార్ణవమ్ములో నైక్య మగుదు!

—o—

# హనుమత్సంరంభము

విద్వాన్ యం. వి. ఆర్. కృష్ణశర్మ



అంతట వానరముఖ్యులు
చింతింపుచు నున్నవారు, క్షితిపుత్రీ వృ
త్తాంతము దెలియక నపుడా
వంతను బాపఁగను జాంబవంతుం డెంతో-

హనుమంతునిఁ బురిగొల్పెను
జనుమని లంకకు, వినియది శత్రుహరుండౌ
యనిలజుఁడు రామ ముద్రికఁ
గొని, దివిపైఁ జనఁదలంచె దనుజుని పురికిన్.

ఏరికి శక్యంబువడని,
వారధినిదాటఁ గనేక భావితుఁడై, వి
స్తారోన్నత శీర్షగ్రి
వారూఢిఁ గలి యనుమఁడు వృషభముగతి
నొప్పెన్.

అంతట బలశాలి హనూ
మంతుఁడు మరకతమణుల సమమయి,
జలమున్
భ్రాంతిం గొలుపులేఁ బచ్చిక
నంత విహరించి, మివులిగ నానందించెన్.

గుణశాలియగు ననుమఁడం
తనఁ బక్షులు భయపడఁగ నొనర్చుచు,
దనఱో
మ్మున వృక్షములను ద్రోయుచు,
ఘన మృగములఁ గూల్చుచు, మృగ
కాంతుని నొప్పెన్.

హనుమంతుఁ డింద్రునకును,
నినునకు, నజుకి నజనికున కెడఁదన భక్తిం
దనరఁగ నమస్కృతులఁ బెం
పునఁ గావించి, యటనుండి పోవఁదలంచెన్.

ధీరుండౌ హనుమంతుఁడు
దూరవు మొగముగఁ దిరిగి, యవారణ
భక్తిన్
మారుతమున కిడి వందన
వారమ్ము, దక్షిణదిశకుఁ బయనంబాయెన్.

వనచర ముఖ్యులు గాంచఁగ,
హనుమంతుండంత భీకరాంబుధి దాటన్
మనమున నెంచియుఁ బెంచెను
దనువును, బర్వంబులందు వననిధివోలెన్.

కొలఁతను లేనట్లు దనువు
లలిఁ బెంచి, జలధిని దాటఁగలిగియు శక్తిన్
విలసిత మహేంద్ర ధరమును
జలియింపఁగఁ జేసె, ననిలసంభవుఁడంతన్.

కదలినిదా యన్నగమే
కదలెఁగద, రెండు గడియల కాలంబప్పం
డదురుచుఁ దత్తట తరువులు
వదలిన పుష్పంబులన్ని పర్వతమయ్యెన్.

సెలయేళ్లు మూలకంబుగ
జలముల వదలెడి మహేంద్రశైలమ్ము,
మహా

బలుఁడగు మారుతిపీడన
వలన జలముల విడుచుండెఁ బటుతరలీలన్.

మదకరు లంతట జలముల
వదలెను నాధోరణ ఘనబాధాచయముం
గదియఁగ మదాంబు బృందము
వదలినచందముగ నపుడ వారితరీతిన్.

బలవంతుఁడు, హనుమంతుఁడ,
టులఁబీడింపఁగనెదానిఁ జెలఁగియు, దానం
గలిగిన హేమపురజితపు
శిలలు బయలయెను దదీయ చిహ్నంబు
లతో.

గిరిగుహా భూతములన్నియుఁ
దరుచరవల్లభునివలన దైన్యస్థితినం
జరుగుచు, నంతట వికృత
స్వరమునశోకింప దిశలు వసుధయునిండెన్.

హనుమానుండా గిరిమ
ర్దనము సలుప, దానుండు దారుణ ఘను
లున్
మనమున నలుగుడు వడుచుఁ
జనుదెంచి వెలికి, కఱచె శైలశిలాళిన్.

ఘనశైల శిలములపుడ
గ్నినఁడవిలి, మండుచుఁ జాలఁగీడ్పడి
యును, బీ
డనచేఁగలగుచుఁ బగులుట
గని, యౌషధులేమి సేయఁగఁ దోచ
కుండెన్.

హనుమంతుఁ ద్రొక్కుడుల చే
తను, నద్ధరదరుల నుండి ఘనతనువులతో
డను మెఱయుచు వేగంబునఁ
జనుదెంపుచుండెఁ జిలువులు కొఱగ
విషమున్

వాతసుతు పాద పీడన
చేతనుగాసిఁబడి ధరణజాతములంతన్
భీతిని సుమముల రాల్చెను ;
ధాతువులతో, శిలలన్ని దబ్బునఁ బగిలెన్

గిరితోడఁ బంచభూతము
లురవడి భిన్నములగునని యా హా న,
మునులా
ధరమును విడి వేగంబున
సురవర్త్మంబున కరిగిరి కరభయ మతినన్.

అట విద్యాధరులందఱుఁ
బటు భీతిమతిని నొడవఁగ భామలతోడన్
స్ఫుట హేమపాత్రిలన్నిటిఁ
జటుతర ఖడ్గాదుల విడుచుఁజనిరయ్యెడలన్.

గిరియంత దనువు గలిగిన
భరరయ సమేతుఁడగు, ఘనవాతసుతుండా
కరనక్రభయంకరమా
వరవారానిధిని దాటఁ బయనంబయ్యెన్.

"వాల్మీకి రామాయణము" నుండి

(సశేషము)

—o—

# పెండ్లి ముచ్చట్లు

శ్రీమతి పి. రాజేశ్వరమ్మ

ఏమండీ! పెద్ద పిల్లకు పెండ్లి ప్రయత్నంచేయరా ఏమిటి, ఎన్ని పర్యాయములు చెప్పినా, చూస్తూన్నాను! చూస్తున్నాను అనడమే కాని శ్రద్ధవహించి నట్లు ఏమీకనబడదు. ఏమిటండీ మీవూహ అంది? మీనాక్షమ్మగారు.

సోమసుందరంగారు, చూడు, మీనాక్షీ, ఏమిటీ తొందర! పిల్లలు యింకా చదువుకుంటున్నారుకదా, ఆ పైన వాళ్ళకు ఏమంత వయస్సు వచ్చిందని నీవూహ యింతకి శ్యామలని కనుక్కొన్నావా ఏమంటుందో ఏమిటో అని నవ్వ్వుతూ సమాధానంచెప్పేడు.

చాలెద్దురూ పిల్లనాకువివాహంచేస్తారా చెయ్యరా అని అడుగుతుందా ఏమిటి. ఏమో మేమెరుగం ఐతే పిల్ల నాకు పెండ్లి చెయ్యండీ అని అడిగేదాకా చెయ్యరన్నమాట! యిదేనా మీసంకల్పం! అని విసుగ్గా వెళ్ళిపోయింది.

సోమసుందరంగారిది రాజమహేంద్రవరము. ఆయనకు మంచి భూవసతివుంది. బి. ఏ. డిగ్రీపొందినా, ఆస్తివుండడము చేత ఉద్యోగమునందు ఆసక్తి చూపలేదు. ఉన్న ఊరునందే స్వంతభవంతియందు వుంటూ పొలము చూసుకుంటూ, అప్పుడప్పుడు పత్రికలకు వ్యాసములు వ్రాస్తూ సిరిసంపదలతో, పాడి పంటలతో, యింటినిండా నౌకర్లు మొదలగు పరివారములతో నిత్యకళ్యాణం, పచ్చతోరణంగా జీవయాత్ర సాగిస్తున్నాడు.

ఆయనకు లలితా శ్యామలా అనేయిరువురు కుమార్తెలు. వారిరువురు విద్యాబుద్ధులతోనే కాక, సంగీతము, నృత్యము కుట్టుపని మొదలగు లలితకళలలో కూడా ప్రవీణులయ్యారు. వారికికల విద్యా సంపత్తి వారి అపురూప సౌందర్యానికి తోడై, బంగారమునకు పరిమళ మబ్బినట్లురాణింపజేస్తోంది.

ఒకనాడు, సోమసుందరంగారు డ్రాయింగు రూములో కూర్చుని పేపరుచదువుతూ "అమ్మా, శ్యామలా" అనిపిలిచాడు. తండ్రి పిలుపువిన్న శ్యామల 'ఏమండీ నాన్నగారూ పిలిచేరెందుకండీ' అని అడిగింది. "అబ్బే, ఏమీలేదమ్మా ఏమిచేస్తున్నావో అని పిలిచేను. బాగాచదువుకుంటున్నారా, తల్లీ చెల్లీనువ్వూనూ—అవునుగాని, అమ్మా! నీవివాహ విషయంలో మీ అమ్మ చాలా అలజడిచేస్తోంది. నీ ఉద్దేశం ఏమిటో కొంచెం చెప్పు తల్లీ" అని అన్నాడు. శ్యామల చాల సిగ్గుతో "నాకేమీ తెలియదండీ నాన్నగారు" అని వెళ్లిపోయింది. ఈ మాటలు ప్రక్కను నక్కివింటూన్న లలిత మాత్రం పరుగుపరుగునవచ్చి, తండ్రి ఒడిలో వ్రాలి "ఏమిటండీ నాన్నగారూ. అక్కకి పెళ్లా? ఎప్పుడండీ? బావగారెవరండీ? వారిది ఏవూరండీ?" అని ప్రశ్నల వర్షంకురిపించింది. అంతట సోమసుందరంగారు "ఏమిటే వెర్రి తల్లీ యీహడావిడి. ఇదంతాచూస్తే అక్కకన్నా నీకేముందు పెళ్ళిచెయ్యాలేమో అనిపిస్తోంది" అని కూతుర్ని బుజ్జగిస్తూ సమాధానం చెప్పేడు.

ఇలా సంభాషణ జరుగుతూవుండగా, "వీధిలో సంగీతం మేష్టారు వచ్చి కనిపెట్టుకుకూర్చున్నారని" నౌఖరు వచ్చి చెప్పడంచేత, శ్యామలా లలిత లిద్దరూ సంగీతం నేర్చుకుందుకు వెళ్ళేరు.

కొన్ని రోజులుగడిచాయి. ఒక రోజు సోమసుందరంగారు పెళ్లాన్ని పిలచి "మీనాక్షీ! పిల్లని పెళ్ళివిషయమై కదిపితే తనకేమీ తెలియదంది. పోనీ నీవేనాకనుక్కొంటే ఏమంటుందో తెలుసుకోవచ్చుగదా!" అన్నాడు. ఆమె మాత్రం యథాప్రకారంగా "ఏమిటండీ విచిత్రపుమాటలు మీరూను. మనకి నచ్చిన సంబంధం ఏదో అన్నివిధాలాబాగున్నది

మాసి చెయ్యాలికాని పిల్లనడిగితే దానికేమి తెలుస్తుందండీ! చిన్న పిల్ల" అంది.

"అదికాదే నా ఊహ. పిల్ల యిప్పుడు ఫిఫ్తుఫారం చదువుతోంది కదా స్కూలుఫైనలైనా పూర్తికాకుండా వివాహవిషయం తలపెడితే ఒప్పుకుంటుందో, ఒప్పుకోదో అని, అంతేకాని నాకుమాత్రం పెండ్లి చెయ్యాలనిలేదా ఏమిటి ?"

"అప్పుడే సంబంధంయెదిరి సిద్ధంగా ఉన్నట్లు మాట్లాడతారేమిటండీ! తగిన సంబంధం కుదురాలంటే ఎంత విశ్వప్రయత్నం చెయ్యాలండీ – యిప్పట్నించీ ప్రయత్నాలు చేస్తే, మీకోర్కెప్రకారం పిల్ల స్కూలు ఫైనల్ పూర్తిచేసే సరికైనా సంబంధం స్థిరపడుతుంది" అని సమాధానంచెబుతున్న సమయంలో, లోపలినుంచి, "మీనాక్షీ! మీనాక్షీ!" అని కేక వినబడ్డంచేత అత్తగారు పిలుస్తున్నారని చెప్పి ఆమెలోపలకు వెళ్ళింది."

భార్య చెప్పిన సలహాప్రకారం పిల్లకు సంబంధాలు వెతకాలని నిశ్చయించుకొని సోమసుందరంగారు మర్నాడు తమ పురోహితులైన పేరయ్యశాస్త్రి గారకే కబురుచేశారు. కబురు అందగానే ఆయన వారింటికి వచ్చాడు.

"ఓహో శాస్త్రిగారా దయచెయ్యండి" అని, ఆయనను ఆహ్వానించి సుఖాసీనుల్ని జేశాడు.

ఈ విధంగా భర్త, పిల్ల పెండ్లి విషయమై శ్రద్ధ చూపుతున్నందుకు ఆనందభరితురాలై, తానుకూడా శాస్త్రిగారి రాకకు కనిపెట్టుకుని అంతకు ముందునుంచీ అక్కడేవుంది.

శాస్త్రిగారు రాగానే పెద్దది అన్ని విధాలా అనుభవంకలది అని తన తల్లిగారినికూడా రమ్మని కేక వేశాడు, జరిగేసంభాషణలలో పాల్గొనేందుకు.

ఆమెకూడా లోపల్నించి వచ్చి అక్కడే కూర్చుంది.

ఈ అలజడంతా చూస్తున్న శాస్త్రిగారు మాత్రం తన్ను పిలిపించిన పని ఎందుకైవుంటుందో యిట్టే గ్రహించి, ఎరుగున్న సంబంధాలనన్నింటికీ బుర్రలో తిరుగవేయడం మొదలెట్టినట్లు కూర్చున్నాడు.

తల్లీ వచ్చి కూర్చోగానే "శాస్త్రిగారూ మా పెద్ద పిల్లకు పెళ్ళి చెయ్యాలనే ఆలోచన కొంతకాలం నుంచీ మాకు గట్టిగాపట్టుకొందండీ. నా సంకల్పం పిల్ల స్కూలుఫైనల్ పూర్తిచేసిన తర్వాత చెయ్యాలని; మా ఆవిడ సంకల్పంకూడా అదే అయినప్పటికీ ఇప్పటినుంచీ వెతికితేకాని తగినసంబంధం అప్పటికి రావద్దా అని ఈ విషయంలో మీ సలహాకూడా తీసుకోవాలని మా అభిలాష. అందుకే మీకిప్పుడింత శ్రమకల్గించింది." అన్నాడు.

"శ్రమేముందండీ, అందులో వివాహంవంటి శుభకార్యాల్లో చేయకలిగిన సహాయం చెయ్యడం అంటే నాకెంతో సంతోషము. తమరు కబురుచేసినప్పుడే విషయం ఏమైవుంటుందా అని అనుకొన్నాను. తీరా యిక్కడికి వచ్చి మిమ్మల్ని చూడగానే, పెద్దపిల్ల పెళ్ళి విషయమై ఉంటుందని అనుకొన్నాను. అమ్మగారు వచ్చేలోగా అందుకే తమ తాహతుకు తగిన ఎరుగున్న సంబంధాలు ఏమైనావున్నాయా అని ఆలోచించడం మొదలు పెట్టాను."

అసలే ఆదుర్దాగావున్న మీనాక్షమ్మగారు అందుకొని "శాస్త్రుల్లుగారూ! రాత్రింబగళ్లు మాకు పిల్ల పెళ్ళివిషయమై ఆలోచన పట్టుకుందండీ. ఏదో ఇంత తెలివితేటలు మంచిచదువూ తినడానికి యింత వసతివున్న సంబంధంమేదైనా మీ దృష్టిలోవుంటే చెప్పుదురూ!"

సోమసుందరంగారు కూడా అందుకొని "శాస్త్రిగారికి తెలియదా ఏమిటి పిల్లవాడు బుద్ధిమంతుడై యింత స్థితి అది వున్నవాడై వుండాలని మా అమ్మ అంటుంది.

"పిల్లవాడు మంచిరూపవంతుడై, బుద్ధివంతుడై మంచిస్థితికల వాడై, దానికితోడు చదువుకున్న వాడై వుండాలని మా ఆవిడ కోరుతుంది."

"పిల్లవాడురూపవంతుడై, బుద్ధిమంతుడై స్థితి వున్నా లేకపోయినా బి. ఏ. వరకైనా చదువు కున్నవాడై వుండాలని నా కోరిక. మా కోరిక లిలా వున్నాయండీ శాస్త్రిగారూ."

ఇకనే సర్వమూ యిప్పుడు విశదమైంది. స్థితి రూపమూ, విద్యా, గుణమూ, సామర్థ్యము ఉన్న కుర్రవాడు కావాలంటారు. కోరికలవుతే బాగా వున్నాయి కానీ యీ లక్షణాలన్నీ కలిగిన కుర్ర వాడు ఒహపట్టాన దొరుకుతాడంటారా? ఒక వేళ దొరికినా కట్నకానుకలు విషయంలో వాళ్ల దాహం తీర్చటానికి వీలౌతుందా! ఐనా తమ విషయంలో ఏమాత్రమూ అప్రమత్తత చూపకుండా తగినప్రయత్నాలు చేస్తాను. లోకమంతా గాలించి వలసివచ్చినా గాలించి తీరుతాను."

మీనాక్షమ్మగారు "ఈ భారమంతా మీమీదే ఉంది శాస్త్రిగారూ! కట్నంకానుకల విషయంలో ఎంతవరకూ భరించడానికి వీలౌతుందో అంతవరకూ భరించుదాం. చూస్తూ, చూస్తూ, లక్షణమైన పిల్లను తీసుకొనివెళ్ళి కానిచోట పడవెయ్యగలమా చెప్పండీ అది సుఖపడవద్దూ!"

"ఔనమ్మా ఔను పిల్లను నేనెరుగనా ఎంత రూపవతి ఎంత విద్యావతి ఎంతబుద్ధిమంతురాలు! నేచెప్పేనుకాదమ్మా నాశాయిశక్తులా ప్రయత్నించి తగినసంబంధాన్నే తీసుకువచ్చి మీకునచ్చుబాటయే టట్లు చేస్తాను, సరే_ఈ విషయంలో మీరేమీ అధైర్యపడవద్దు"

సోమసుందరంగారు "ఔను శాస్త్రిగారూ, మీరంతటివారనే ఈ విషయాన్ని మీకు అప్ప గించాము. మా మేనల్లుడు మోహన్ కూడా దృష్టిలో ఉన్నాడు. కాని పిల్లవాడికంటే ముందు మా బావగారితో వేగడం బహు కష్టమండీ. అతనిది మళ్ళీలో, ముళ్ళు వేసే స్వభావం మనమెంతచేసినా రాణింపుకురాదు" అన్నాడు.

అప్పుడు సోమసుందరంగారి తల్లి మాత్రం, ఏమిట్రా నాయనా, నీకు పట్టుదలేకాని, లేనిపోని కారణాలు చెప్పి నిక్షేపంలాంటి సంబంధం వదులు కుంటావుట్రా, కుర్రాడేదో పెద్ద చదువేటగా చదువు చున్నాడు! కలిసిన సంబంధం మన కమల సంతోషి స్తుంది. వెర్రి పిల్ల పదిసార్లు ఇక్కడి కొచ్చినప్పుడల్లా మా పిల్లవాడికి పెళ్ళెంతయారవుతోందని అనేది. పిల్ల వాడికి కూడా ఇష్టమేటగా! నీ బావమాత్రం పట్టు బడితే ఒప్పుకోడా ఏమిటి-నీ వెర్రికానీ."

శాస్త్రిగారుకూడా వెంటనే "అవునండీ, యింకా సందేహిస్తారెందుకండీ! కొండ తలక్రింద పెట్టుకొని రాళ్ళకొరకు వెతికినట్లుఉంది. ఈ సంగతి నేనే ఎత్తుదామని యిందాకనే అనుకొన్నాను. కాని మీరేకారణంవల్ల తలపెట్టడంలేదా అని ఊరు కొన్నాను. మీరు ఊ అంటే ఇప్పుడే నేను వెళ్ళి తథాస్తని చక్కా వచ్చేస్తాను; ఏమంటారు?"

దానిపై సోమసుందరంగారు "మా బావతో వేగలేమండీ, మా చెల్లెలు పెళ్ళయిన నాటినుంచీ అతన్ని నేనెరుగనాండీ! అతను సామాన్యుడుకాడు. నేనంటే ఎందుకో అతనికి గర్భవిరోధము. ఆ సంబంధం చేసుకొని మనం నిగ్రహించలేము. కనుక మీ ఎరిక సంబంధం ఎదేనావున్న చూద్దురూ, శాస్త్రిగారూ"

చివరికి పైసంబంధాన్ని చూడ్డానికే నిశ్చయించు కొన్నారు. మరో పర్యాయం చెప్పడంవల్ల శాస్త్రి గారు తగిన సంబంధం చూస్తానని నడుంకట్టాడు. భోజనాలకి వేళవడంవల్ల శాస్త్రిగారినికూడా మడి గట్టుకొమ్మని సోమసుందరంగారు బలవంతపెట్టారు. కాని ఆయన పనులు చూసుకొనవలసినవి కొన్ని వున్నాయని చెప్పడంచేత ఆయనను సాగనంపి అంతా భోజనాలకు లేచారు. భోజనాల దగ్గరకూడా సంబంధాల విషయమై తిరిగి మరొకమారు సంప్ర దించుకొన్నారు. "నా వెర్రి తల్లికి ఎటువంటి మొగుడు వస్తాడో" అని మాటల మధ్య తల్లి పది

పోర్లు అనుకొన్నది. శ్యామల వాళ్ళు చెప్పుకొనే మాటలు తలవంచుకొని వింటూ, విననట్లుగా భోజనం చేస్తున్నట్లు నటించింది.

లలితకు మాత్రం "తగిన సంబంధం ఎందుకురాదూ, లేకపోతే బావగార్ని ముప్పతిప్పలూపెట్టి మూడు చెరువులనీళ్లూ—అక్కడాకా ఎందుకు నేనే తాగించేస్తాను."

స్కూలు ఫైనల్ పరీక్ష రోజులు ఒక మాసం ఉన్నవి. శ్యామలా, లలిత లిరువురూ తమ తమ చదువుల్లో నిమగ్నులయ్యేరు.

కొంతకాలం పిమ్మట ఒకనాడు మధ్యాహ్నం మూడు గంటలూ ఆ ప్రాంతములో సోమసుందరం గారూ, ఆయన భార్య, తల్లీ, నడవలో కుర్చీలలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూన్నారు. యింతట్లోకే శాస్త్రిగారుకూడా అక్కడికి వచ్చారు. శాస్త్రి గారిని చూడగానే అంతా సంతోషంతో ఆయనను సత్కరించి, కుర్చీపై కూర్చోమన్నారు. కుశల ప్రశ్నాదికము అయిన పిదప, శాస్త్రిగారు తామంత వరకూ చేసిన వివాహక విషయమైన ప్రయత్నాలను గురించి మొదలు పెట్టారు.

"ఆ నాడు మీతో చెప్పింది మొదలుకొని నేటి వరకూ మీ అమ్మాయి వివాహ విషయంలో నేను చెయ్యని ప్రయత్నం లేదంటే నమ్మండీ, తిన్నచోట పడుకోకుండా, పడుకున్నచోట తినకుండా, ఎక్కడెక్కడ ఊళ్ళకూ దూరభారమనకుండా వెళ్ళి ఎరుగున్నవాళ్ళను అందరిని విచారించడమేకాకుండా కళాశాలలూ, లైబ్రరీలు, క్లబ్బులూ మొదలగు వాటికికూడా వెళ్ళి మనదేశంలోగల పెళ్ళికొడుకుల నందరినీ విడవకుండా చూసివచ్చానండీ, మనకి అన్ని విధములా సరిపడిన సంబంధాలు కొన్ని తెలుసుకొని వచ్చాను. కాని అన్నింటికంటే ముఖ్యమైన సంబంధం ఒకటి నెల్లూరులో తటస్థమైంది.

పిల్లవాని పేరు గోపాలరావు. బి. ఏ. చదువుతున్నాడు. ఎర్రగా తొగడు ధారంలా, కనుముక్కు తీరువుగావుండి చాలా లక్షణంగా వుంటాడు. ఈ కుర్రాడు చేబ్రోలు నరసింహం గారనే ఆయనకు రెండవ పిల్లవాడు. ఆయన జిల్లా కోర్టు ప్లీడరు. నెలకు రు. 1500, 1000కు తక్కువ కాని రాబడి. స్వార్జితంవల్లనే మంచి ఆస్తిపాస్తులు గడించేడు. ఆయనకు ముగ్గురు కుమారులు. ఈ పిల్లవాడు రెండో పిల్లవాడు. అన్నింటిలోకి యీ సంబంధమే మనకు బహు యోగ్యంగా ఉండేటట్లు కనబడుతోంది."

"ఆ వెంటనే మీ సాత్తమ్మగారు ఈ సంబంధంచేస్తే పిల్ల చాలా అదృష్టవంతురాలయ్యేటట్లు కనబడుతోందండీ."

శాస్త్రిగారు చెప్పిన మాటల తీరునబట్టి సోమసుందరంగారుకూడా అంతకంటే వేరే ఏమీ అనలేకపోయి, యింత చక్కటి సంబంధం సులభంగా లభ్యమౌతుందా అన్న సందేహంతో "కట్నకానుకల విషయం చెప్పేరుకాదు?"

"ఇదిగో వస్తున్నా కట్నకానుకలు హెచ్చుగా వున్నట్లు కనబడినా ఆ సంబంధాన్నిబట్టిచూస్తే తక్కువగా వున్నాయనే చెప్పాలి. ఏమంటారా ఆస్తిపాస్తులువల్ల ముగ్గురు కొడుకులకూ కలపి రు. 6000 వస్తాయట. తండ్రి యింకా మంచి గడింపులోనే వున్నాడు. పిల్లవాడు చదువుకుంటున్నాడు. యింతకీ వారు అడిగినది రు. 5500/-యితర లాంఛనాలక్రింద 500/-మొత్తము రు. 6000/-అనుకోండి"

సోమసుందరంగారూ, ఆయన భార్య కలసి యీ మాత్రం యివ్వందే యీ రోజుల్లో వరుడు దొరకడం కష్టమని తలంచి, బాగానే వుందన్నారు.

ఆయన తల్లిమాత్రం కమల కొడుకు సంబంధం మాత్రం దీనికి తీసిపోయిందా ఏమిటి అని అనకుండా వుండలేకపోయింది.

చివరికి శాస్త్రిగారు తెచ్చిన సంబంధమే నిశ్చయించారు." త్వరలోనే ముహూర్తం ఏర్పాటు

చేయించండీ శాస్త్రిగారూ! పిల్లలకీ పరీక్షలయిపోయినవి. యింక ఏవిధమైన అడ్డంకులూకూడాలేవు."

"ఓ దానికేమి యీ మధ్యవారం, పదిరోజులలో ఒక ముహూర్తంవున్నట్లు జ్ఞాపకం ఏదీ పంచాంగం ఓసారి యివ్వండి—యిక్కడే ముహూర్తం నిశ్చయం చేసి వెళ్తాను" అని అక్కడే ముహూర్తం నిర్ణయించి స్థిరపరుస్తాడు శాస్త్రిగారు.

ఈ ముహూర్త నిర్ణయం మగపెళ్ళివారికికూడా తెలియజేసి వారి సమ్మతికూడా తీసుకున్నారు.

పెండ్లి ముహూర్తం చాలా తొందరలో కుదరడంచేత పెళ్ళికి అందరూ పనులుచేసేవారే.

వివాహము ఎల్లుండి అనగా అందరూ పెండ్లికూతుర్ని చేసే నిమిత్తం పిలుపులకు బయలుదేరారు.

శ్యామల మేనత్త కమలకూడా ఆ రోజు సాయంత్రం బండికి, అన్నగారి కుమార్తె వివాహం చూడడం నిమిత్తమై చంటిపిల్లని తీసుకుని వచ్చింది.

ప్రొద్దున్నే శ్యామలని పెండ్లికుమార్తెను చేసే నిమిత్తం తలంటి స్నానంచేయించి మంచిరకమైన మైసూరుశిల్కుచీర కట్టారు. ఆ మధ్యాహ్నం పేరంటాళ్లందరూ వచ్చారు. ఆ వేడుక చాలా ఆనందముగా జరిగింది.

ఆ రాత్రి బండికే పెళ్ళివారేవత్తుమంది నెల్లూరు నుంచి బయలుదేరి రాజమండ్రీ చేరుకున్నారు. పెండ్లివారికి తగు మర్యాదలతో ఎదురు సన్నాహం జరిపి విడిదిలో ప్రవేశపెట్టారు. రాత్రి భోజనాలుచేసి ఎవరిపక్కలువారు పరచుకొని నిద్రపోయేరు.

శ్యామల మేనత్తకొడుకు మోహన్ బి.ఏ. బి.ఎల్. మెద్రాసులో చదువుతూ శెలవు లివ్వడంవల్ల శ్యామల పెండ్లికి నేవెళ్లకపోవడమా! అని, పువ్వుల బుట్టలతో ఆ రాత్రి జనతాకు పెండ్లివారింటికి పెండ్లి చూచే నిమిత్తం వచ్చాడు. అతన్ని చూచేసరికి అందరికి ఆనందమయి ముచ్చటగా సంభాషణలు జరిపికొని ఆనందముగా కాలంగడిపేశారు.

తెల్లవారేసరికి మగపెళ్ళివారి విడిదిలో స్నాతకం హడావిడి. ఆడపెళ్ళివారింట్లో కాఫీ, ఉప్మాల హడావిడి, రాత్రి జరగబోయే వివాహసరం జామాను గురించి హడావిడితో నిండిపోయింది.

స్నాతకం ముందు మగపెళ్ళివారి విడిదికి కాఫీ ఉప్మాలనిచ్చే నిమిత్తం, లలిత, తల్లీ మొదలగువారు వెళ్లేరు. పెండ్లికొడుకుని చూచింది. లలిత, ఆమెకు నచ్చలేదుకాబోలు వెంటనే యింటికి వచ్చేసింది. "అక్కా! అక్కా! యీసంబంధంనాన్నగారు చూడలేదా ఏమిటే అతను పెద్దవాడిలా వున్నాడు. మనిషి చూస్తే చాలా వికారికూడాను, చదువుకున్నవాడిలా కనబడలేదే అక్కా; ఎదో బి. ఏ. గోపాల్, పి. ఏ.లా వున్నాడేయీ గోపాలంగారు!" అని నిరసనగా హేళనచేసింది.

యీ హేళన విన్నప్పటినుంచీ శ్యామలకి మనస్సు, మనస్సులోలేదు ఏమిటీ, యింత అన్యాయముంటుందా అని అనేక విధములైన భావములతో ఆనందమంతయు నీరైపోయింది.

తెల్లవారిన తర్వాత సుందరంగారు, యీ వరుణ్ణి, పెళ్ళివారిని చూచినప్పటినుంచీ ఆయన మనస్సు, మనస్సులోలేక, ఖిన్నుడై, శాస్త్రిచేసినదంతయు మాయ అనుకొని యిది ఒదిలేపరిస్థితి ఎలాగా అని ఆలోచిస్తున్నాడు.

యిలా వుండగా, శ్యామల దగ్గరకి, మోహన్, ఒక మంచి విలువైన వింతవస్తు ఒకటి తీసుకొనివెళ్లి "పెండ్లికుమార్తెగారికి బహుమతిగా తెచ్చానండీయీ కానుక స్వీకరించకోరుతున్నాను" అన్నాడు.

శ్యామలకి, మోహన్ని చూచేటప్పటికి విపరీతమైన దుఃఖం వచ్చింది. "ఏమిపెండ్లి బావా, యిదంతయు చాలా మాయగావుంది. యీ వివాహము నాకిష్టములేదు" అని చెప్పేసింది.

యీ కబురువిన్న మోహన్కు ఏమీఅర్థమవలేదు. "ఏమిటి శ్యామలా నీ కిష్టంలేకనే మామయ్య యీ

సంబంధం నీకు స్థిరపరచాడా ”అని జరిగిన సంగతులు తెలుసుకునే నిమిత్తం, మేనమామ దగ్గరకు వెళ్లేడు.

సుందరంగారు జరిగిన మోసం అంతా మేనల్లుడితో చెప్పేడు. మోహన్ యీ జరిగిన సంగతులకు ఆశ్చర్య పడి ఎవరా పెండ్లివారు అని, వాళ్లను చూచే నిమిత్తం విడిదికి వెళ్ళేడు.

అక్కడ తనతో మద్రాసులో చదువుకునే స్నేహితుడు ఒకడు కనుపించాడు. వారిరువురూ ఒకరి నొకరు తమ రాకల విషయమై సంభాషణలు జరుపుకొనిరి. ఆ స్నేహితునికి పెండ్లికుమార్తె ఎక్కడో దూరపుబంధువనియు, తన గ్రామం చేరుకునేందుకు వెళ్లుతుండగా మధ్యనదిగి యీ వేడుకచూచి వెళ్లుదా మని వచ్చాననియు, ఆ పెళ్ళివారి స్థితిగతులు పొందలగు విషయములన్నియు చెప్పుకొచ్చాడు. మోహన్ యీ సంగతులన్నియు విని, మేనమామతో పెండ్లివారి యొక్క యావత్తు పరిస్థితులు చెప్పాడు. అక్కడ వున్న పెద్ద మనుష్యులందరూ యీ మోసం తెలుసుకుని, పెండ్లి పెద్దయిన,తండ్రివద్దకు వెళ్ళి, “ఏమయ్యా, యీ మోసం, యీ అన్యాయమూను, కట్నమనే పేరుతో, డబ్బు సంగ్రహించడానికి వేసిన ఎత్తుటయ్యా యిది. చదువుకున్నటువంటి లక్షణమైన పిల్లను అన్యాయముగా బాధిద్దామనుకున్నారా, చాల్లెండి, మీ నెల్లూరు మాయలు, యిక వెళ్లొచ్చు పెళ్ళివారు. ఎప్పుడూ యిటువంటి అన్యాయమునకు సిద్ధపడకండి” అని ఎవరికితోచినమాటలు వాళ్లు విసిరేసి ఆ వచ్చిన పెళ్ళివార్ని తిరుగు దారి పట్టించారు. వారు నెత్తి నోరు మొత్తుకొని వచ్చిన దారినే తిరుగు ప్రయాణంపట్టి వెళ్ళిపోయారు.

యీ గండం గడచినదికదా అని యింటిల్లిపాదీ సంతోషించి ఆ శాస్త్రుల్లుని అనేక విధముల నిందించి, ఎప్పుడూ, ముక్కు మొగమూ ఎరగని సంబంధాలుకు వెళ్లకూడదని విచారించి, అన్ని విధములా పరిచయమున్న సంబంధం, పెద్దదయిన, అమ్మ చెప్పినట్లు మోహన్‌యే అని నిశ్చయించి ఆ శుభ ముహూర్తమునకు శ్యామలా, మోహనులకు, దేదీప్యమానముగా వివాహము జరిపించిరి. బంధువర్గమంతా ఆ వివాహంలో పాల్గొని, దంపతులను ఆశీర్వదించి ఎవరి స్థానములకు వారు చేరిరి.

నవ దంపతులయిన, శ్యామలా, మోహన్‌ల ఆనందమునకు మేర లేదు.

---



# పుష్పించిన పువ్వు

"ఉదయగిరి"

భారతి మనస్సులో ఆలోచనలు తల లెత్తాయి. గతాన్ని త్రవ్వుకొంటున్నకొద్దీ ఆవేదనతోపాటు ఆవేశం పొర్లుకొచ్చింది. లోకమంతా వేడుకలతో మునిగిపోయి వుంది. అందరి ముఖాల్లోను ఆనందం తొణికిసలాడుతూంది. భారతిలాంటి అభాగిని మాత్రం ఆపుకోలేని ఆవేదనలో, వెలికిరాలేని పెను చీకట్లోనుపడి క్రుగ్గిపోతూంది!

ఎక్కడో, ఎప్పుడో విన్న 'దీపావళి' గీతం ఆమె జ్ఞాపకం చేసుకొంటుంది. దీపావళి! ... జగమంతటికీ దీపావళి... తనకు మాత్రం అది దుర్భరమైన శోకావళి! తమిరావళి!

వీధిలో పిల్లలు కేరింతలు కొడుతూ, టపాకాయలు కాలుస్తున్నారు. ఏవో పిచ్చిగీతాలు పాడుకొంటున్నారు. అర్థంలేని నవ్వుల్తో కబుర్లాడుతున్నారు. లోకంపోకడ తెలియని అమాయకులకు వున్న ఆనందం తనకెందుకు లేకపోవాలి? జీవన్మార్గాన్ని అవగతం చేసుకోవటమే పాపమా? ...అర్థంలేని ప్రశ్నలతో వేగిపోతూంది భారతి.

తన బ్రతుకిలా అవుతుందని కల్లోనైనా అనుకుందా. ఎవరు వూహించారూ? చదువుకున్న, సంస్కారంగల వరుడు దొరికాడనగానే అమ్మా నాన్నా మురిసిపోయ్యారు. ఆప్తమిత్రులు ఎంతగానో హర్షించారు. తనుకూడా ఆమోదం తెల్పింది. తన జీవితం ధన్యమైనది అనుకుంది... కాని, యిప్పుడు జరిగిందేమిటి?... ఆ భర్తే తన్ను బహిష్కరించాడు యీనాడు. డబ్బుతో దాంపత్యానికి విలువ కట్టాడు. ధనానికి బానిసయై మానధనం విలువ తెలీక గుడ్డిగా ఆత్మవంచన చేసుకొని పుట్టింటికి తన్ను సాగనంపాడు. ఎంత నిర్దయ! ఎంత అమానుషం!

రెండేళ్ళుతాను చీకట్లోనే గడపింది. ప్రతి ఏటా దీపావళి వస్తూనేవుంది. కాని తన చుట్టు అలుముకున్న వింత చీకట్ల నడుమ ఆ దీపాల వెలుగు చూపు ఆనటం లేదు... రోజురోజుకు నిశాపతి జర్జరమై కాంతిహీనుడై పోతున్నట్లు ఆమె బాధపడుతుంది. మూసుకున్న కళ్లకు మరేమి కన్పిస్తుందీ అంధకారం తప్ప?

"నీతో చదువుకున్న కామాక్షి చూడు ఎంత ముచ్చటగా కాపురం చేసుకుంటుందో! నీకా భాగ్యం లేకపోయింది" అంటూ అమ్మ కంట తడిపెట్టుకొంటుంది. ఆ మాతృహృదయంలో క్షోభ తనకు తెలుసు. కాని తెలిసి తను చేయగలిగిందేమిటి? నాన్నకు ఎప్పుడూ తన దిగులే. గడ్డంమీద చేతు

లుంచుకొని భూదేవివంక చూస్తూ నిశ్శబ్దంగా ఆలోచిస్తూ పుట్టెడు దుఃఖాన్ని మనస్సులో దాచేసుకోవటం ప్రతినిత్యమూ తాను చూస్తూన్న దృశ్యమే! వాళ్ళేం చేస్తారు! వాళ్ళదగ్గర డబ్బులేనప్పుడు తన కోసం వాళ్ళెందుకు అలా నరకబాధ అనుభవించాలి? నవమాసాలు మోసి, పెంచి పెద్ద చేసి ఒక యింటిదానిగా పంపి సుఖపడమన్నందుకు శిక్షా అదీ? ... ఏమో!

"అక్కయ్యా; గౌరివాళ్ళ బావొచ్చాడే ఎంతమంచి పరికిణీ తెచ్చాడనుకున్నావ్!" అని వొగర్చుకొంటూ వచ్చి చెప్పి వెళ్ళింది చెల్లాయి. తనబావకూడా అలాంటి బొమ్మలూ, పరికిణీలు తేవాలనే ఆశతో. పిచ్చిపిల్ల! అందరి హృదయాల్లో అమృతం వుండదనే రహస్యం ఆ పసి హృదయానికేం తెలుసూ?

భావిని గూర్చి తాను కట్టుకున్న మేడలు విరిగి మీదపడి హృదయాన్ని గాయపరుస్తాయని తను ఊహించిందా? ఏమీలేదు. —తియ్యటి సుఖస్వప్నాలు మాయమయ్యాక కేవలం మోడులా మిగిలిపోయింది తాను. ఎండిన పూలవనంలో కోర్కెలు చివురించే ఆశయింకలేదు. తన బ్రతుకు పతనమైంది. ఎవరికోసం బ్రతకాలి యింక? తన బ్రతుకు భూమికే భారం. తన వల్ల యితరులకు బాధ, వ్యసనం తప్ప యింకేమీ కలుగవు.

భర్త విడిచిన స్త్రీకి యీ లోకంలో మోక్షంలేదు. ఆమె ఎంత పవిత్రంగా బ్రతుకుతున్నా పతితగా ఆమెను హేళన చేస్తుంది సంఘం. ఇక సానుభూతి ఎక్కడిదీ?

భారతి ఊహలు పరిపరి విధాల పోతున్నాయి. ఏ ఒక్కటీ గమ్యాన్ని చేరుకోలేక మళ్ళీ తిరిగి వొస్తున్నాయి... అదాట్న ఆమెలో ఒక ఆలోచన మెఱుపులా మెఱిసింది...తను ఎవరిహింసకు, అపవాదుకు గురికావాలో వారిని శాశ్వతంగా విడిచిపోతే?...

ఆమె వొళ్ళు ఝల్లుమంది. ఆమె భయంతో వొణికిపోయింది. ఒంటిమీద స్వేద బిందువులు తొంగిచూశాయి. మనో నేత్రాల్లో ఏడుస్తున్న అమ్మ గోచరించింది. పిచ్చిగా, గోడకేసి తల బాదుకొంటున్న నాన్న కన్నీటి ఘోష వినిపించింది. ఘోరం! తనకోసం ఏడ్చేవారిని మరింత ఏడ్పించడమేనా తన బాధ్యత? ఎంత స్వార్థం! ఎంత కృతఘ్నత!

ఈ నేరం దేవుడైనా సహిస్తాడా?

తనచావుకు ఏదో అపవిత్రాన్ని అంటగట్టుతుంది లోకం. అదిచేసే విలయనాట్యానికి, సింహగర్జనలకు అమ్మానాన్న తల దిమ్మెక్కుతుంది. వాళ్ళబ్రతుకు దుర్భరమైతే తన దారే చివరికి శరణ్యమౌతుంది.

...పాపం! అశుభం శుభం తెలియని చెల్లాయి ...దిక్కులేని పక్షిలా...

ఇక ఆలోచించలేక పోయింది. ఆమె కళ్ళు జేవురించాయి. ఆమె చెక్కిళ్ళు కన్నీళ్ళతో తడిసి పోయ్యాయి. ఆమెలో రేగిన తుపాను తాకిడికి ఆమెహృదయం ఛిన్నా భిన్నమైపోయింది. గట్టిగా తల పట్టుకొని మొదలు నరికిన చెట్టులా కూలి పోయింది, పాపం ఆ అభాగిని.

అంతలో ఏదో చప్పుడైంది. అమ్మా నాన్నా పరుగెత్తుకొచ్చారు. వాకిట్లో ఏదో బండి వచ్చి ఆగింది. భారతి కాసేపటికి కను రెప్పలు విప్పింది. తన కళ్లు తానే నమ్మ లేక పోయింది! ఎదురుగా తన భర్త నవ్వుతూ జాలిగా తన కళ్ళల్లోకి చూస్తు న్నాడు. భారతి కళ్ళుమలుముకొంది... తన భర్తే!...ఆమె నివ్వెర పోయింది. నోటమాటరాలేదు.

అతను దగ్గరగా వచ్చి చేతులందుకొని "నీకోసం వచ్చా భారతీ!" అన్నాడు మెల్లగా, - లాలనగా.

భారతి మాట్లాడలేదు.

"మనం వెళదాం" అన్నాడు హృదయం స్పందించే పశ్చాత్తప్త స్వరంతో.

ఈ సారి భారతి పెదవి కదిలించి "ఎక్కడకీ?" అన్నది అయోమయంగా.

"మన యింటికి" అన్నాడు భర్త ధీమాగా-నిర్మలంగా ఆమెను ఆహ్వానిస్తూ

భారతి అశ్రుపూర్ణనయనాల్లో ఆయన కేదో విపంచికా స్వరం వినిపించింది. అది వినోదగీతమో-విషాద గీతమో చెప్పలేం!



# అంతరించిన ఆనందం

'శార్వాణి'

మిత్ర శ్రీ రామారావుకి నమస్సులు ...

నిమిష నిమిషానికి, గంట గంటకు, రోజు రోజుకు నాలో విచిత్రపరిణామం ప్రబలుతోంది. ఆ పరిణామం మంచి చెడులను నిర్ణయించలేకపోతుంది. జీవితంలో మహత్తరమైన వస్తువును కోల్పోయి, నిరాశతో నలిగిపోతున్న మనస్సు, మమతకు దూరం అయిపోయింది. అందరికీ అతి తేలిగ్గా అర్థమయ్యే బాధ మాత్రం, హృదయంమీద కూర్చుని, చీకటి వేపుకి నడిపిస్తుంది. ఆ బాధ కన్నీరుగామారితే, ఎవరికీ కన్పించకుండా, చివరకు అందర్లా ఏమవుతారో ఆ మట్టిలో కలసిపోతుంది. చీకటి గోడల మధ్య ఎన్ని రోజులు యిలా కూర్చోవాలి? ఆశలు పెంచుకుంటున్న జీవితం, ఒక్కొక్క మెట్టునుంచి జారిపడుంతుటే, నిశలో నవ్వుతున్న నిరాశ నిలచి చూస్తుంది.

నిన్నరాత్రి నడుస్తున్నాను — నా నీడను తొక్కుకుంటూ నడుస్తున్నాను. చీకటిలో వెలుతురువల్ల యేర్పడిన నీడ, నన్ను చూచి జాలిపడటంలేదు. సానుభూతి చూపడంలేదు. ఎందుకని? ఆ నీడకు ఆధారం నేనే! నేను లేకపోతే ఆ నీడ రాదు.

ఆ నీడలో మసగ మసగగా ... కన్పిస్తోంది, చిన్నప్పుడు, అప్పటికింకా నీతో నాకు పరిచయం లేదు. అప్పుడు నేను మా మామయ్యగారింట్లో వుండేవాడ్ని. బాధలంటే తెలియని రోజులు. తెల్లవారు ఝామున మామయ్య లేపి, చాకలివాడింటికి పంపినపుడు, చలిలో వెళ్తున్నా, బాధంటే తెలిసేదికాదు. ఇప్పుడు చలేస్తే ... అమ్మ బాబోయి, ఇంకేమైనా వుందా? వణికిపోతాం, కప్పుకోడానికి శాలువా లేకపోతే దుప్పటి వుండాలి. అప్పుడు ఎంతకష్టమైన పనిచేసినా, బాధనిపించేదికాదు. బాధ ఫలానా విధంగా వుంటుందని తెలియదు కాబట్టి, నిజంగా కష్టపడుతున్నా, బాధపడుతున్నట్లు ఫీలవ్వను. ఆ రోజులు యించక్కగా వుండేవి. ప్రాణం హాయిగా వుండేది, మనస్సు స్థిమితంగా వుండేది. చదువు చక్కగా సాగేది. ఏపని తలపెట్టినా విజయవంతంగా, బాధలేకుండా జరిగిపోయేది. బాధ, విచారం, దుఃఖం, నిరాశలేని పరిస్థితులలో, ప్రేమించడం నేర్పింది మంచి భావం ... ఆ ఇంట్లోనే ఒక అమ్మాయి ఉండేది ... అది అప్పుడు చాల చిన్న పిల్ల. పరికిణి, జాకెట్టు వేసేది. అది కట్టుకునే దుస్తులు చాల ఖరీదైనవి. మరి నేనో, చాల తక్కువ ధరలో బట్టలు కుట్టించుకునేవాడ్ని. అది ఖరీదైన బట్టలు కడుతుందని నాకు అసూయలేదు. నేను ముతక చొక్కాలు వేస్తున్నందుకు దానికి బాధలేదు. పేద పెన్నిధుల తారతమ్యతకు మా స్నేహంలో చోటు వుండేదికాదు. మంచి భావంతో యిద్దరూ పెరుగుతున్నాం. ఆ ఇంట్లోనేకాదు, బయటచుట్టాలుకూడా, "వెంకటేశ్వర్రావు మంచివాడని, చాల బుద్ధిమంతుడని" అభినందించేవారు. ఏ అమ్మాయి నా హృదయంలో స్థిరరూపాన్ని చిత్రింపచేసుకుంటుందో ఆ అమ్మాయి, నేను మంచివాడ్నని గుర్తించింది. అందుకు సంబరపడ్డాను. మహోజ్వలమైన భవిష్యత్తు వుంటుందని వువ్విళ్లూరి, వూగిపోయాను. తియ్యని కలలు కన్నాను. ఒక రోజు దీపావళినాడు, అది తలంటుకొని, కొత్త బట్టలు వేసుకొని నా దగ్గరకు వచ్చింది. పూసరేకులు, సున్నుండలు బలవంతంగా తిన్పించింది. తినకపోతే వీసిచిట్లకొట్టేది. అప్పుడుకూడా బాధంటే తెలిసేదికాదు. అమాహ్యమైన ఆనందం, అవ్యాజమైన అనురాగం అవతరించేవి. అడుగడుగునా ఆనందం అందేది. కాలం మమ్మల్ని పెద్దవాళ్లని చేసింది. లోకం మమ్ములను వేరుచేసింది. విడిపోయాయి హృదయాలు; విచ్ఛిన్నమైపోయాయి జీవితాలు. దానికి పెళ్ళయిపోయింది. అది నన్ను పూర్తిగా మరచిపోయింది. దానికి కావలసినంత డబ్బు, పెట్టుకోలేనన్ని నగలు, షికార్లు తిరగటానికి కారులు, అవేమి నా దగ్గరలేవు, అది నా మనస్సును ప్రేమించింది. మరొకడి ధనాన్ని పెళ్ళిచేసుకుంది, సుఖం ధనానికిస్తుంది, మంచిని మనస్సుకు అందివ్వడానికి ప్రయత్నంచేస్తుందట. అది మరొకడ్ని

వివాహంచేసుకుందని, పిచ్చివాడ్నయిపోలేదు. లైలాకోసం కైస్‌లాగ, అనార్కలీకోసం సలీమ్‌లాగ చావలేదు. కైస్‌మీద, సలీమ్‌మీద జాలిపడలేదు. వాళ్లు అనవసరంగా, ప్రేమకోసం బలయ్యారు. ప్రేమకోసం బలిఅవ్వడమంత తెలివితక్కువతనం మరొకటి వుండదు. బాధపడుతూ ప్రేమలోవున్న నిజాన్ని తెలుసుకోవడం చేతకాక, ఎడారిలో పెనుతుఫానులో ఒకడు, సమాధికి నెత్తికొట్టుకొని మరొకడుదారుణంగా చచ్చారు-పిచ్చివాళ్ళు.

నిబ్బరంగా వున్నాను. పీడవదిలిందని వూరుకున్నాను. పెళ్లిచేసుకోవాలని సంబరపడ్డాను. నా పెళ్లిగురించి, మావాళ్ళెవరికీ శ్రద్ధలేదు....ఒక్క మా అమ్మకు తప్ప ... తన తనువుండగా నా మనువు చూడాలని ఆమె తాపత్రయం. ఎన్నో సంబంధాలు చూచింది. ఒకటీ తనకు నచ్చలేదు. ఆమెకెందుకు నచ్చలేదోనాకు తెలుసు. చెప్పుకుంటే సిగ్గు అయినా చెప్పాలి. కట్నం తక్కువని నచ్చలేదు. ఎవడో తలమాసిన వెధవ కట్నం గుంజుకొని, ఏదో పెద్ద పొడిచేస్తున్నాడని, లోకం కట్నంతీసుకొనక పోతేహర్షించదని, నన్ను రెండువేల ఐదువందలకు పెళ్ళి మార్కెట్టులో అమ్మివేశారు. అందుచే నా పరిస్థితి యిలా పరిణమించింది. సంబంధంకుదుర్చుకోనేముందు నిన్నుతీసుకొనివెళ్ళినందు కిప్పుడు బాధపడుతున్నాను. పెళ్లి కొడుకుగా ఆ అమ్మాయిని ఏవిధముగా చూడగల్గానో, అదేవిధముగా నీవు చూచేవేగాని నాభవిష్యత్ జీవితాన్ని ఆలోచించలేకపోయావు.

“అమ్మాయి ఎట్లావుంది” అని అడిగారు,

“అమ్మాయికే! బ్రహ్మాండంగా వుంది” అని చెప్పావు. నీవుకూడా మా వాళ్లు తొందర పడినట్లు తొందర పడ్డావు. అన్నిటికంటె ఇది మరీ విచిత్రం-పెళ్ళి ముందు మా అన్నయ్యను సంబంధం చూడ్డానికి పంపించాను. అప్పుడతనికి మనస్ఫూర్తిగా నచ్చలేదు. అందరికి నచ్చిందని అన్నారు కాబట్టి, తనకూ నచ్చిందని మనసులో విషయాన్ని దాచాడు. వీళ్లందరూ మనుష్యులు. నా జీవితానికి సుఖాన్ని అందించే ఆపద్బాంధవులు

రామారావూ! అంతా అయిపోయింది. ఊహించిన విషయంలో వెయ్యోవంతుకూడా జరగలేదు. గీతాన్ని జ్ఞాపకం చేసుకొని బాధ పడటం మరచి పోవాలని ప్రయత్నంచేస్తున్నా, ప్రయోజనం లేకపోతుంది. నా వివాహం అయిన 120 రోజుల్లో, “సుఖపడ్డాను” అన్న రోజు వెతుక్కుంటే దొరకదు. సుఖంలేదు. ఆనందంరాదు. ఇహపోతే డబ్బిచ్చి సుఖాన్ని కొనుక్కోవాలి. మనసిచ్చి సుఖాన్ని పొందే తరుణం జారిపోయింది. ధనంతో ఆనందానికి వెల కట్టి, సంతోషపడటం నేర్చుకోవాలి.

ఒకందుకు విచారిస్తున్నాను. అది చిన్నపిల్ల. పాపం! బాధంటే దానికింకా తెలియదు. దానికి పెళ్ళయినా పసిపిల్లే! ఏంచేయను? దానికోసం విచారిస్తున్నా, ఆ విచారం కసిగా, బాధగా మారిపోతుంటే ఏంచేయమంటావు? అవును నాకు సుఖం కావాలి...కష్టపడుతున్నాను. మెదడును పాడుచేసుకుంటున్నా. రెక్కలు ముక్కలయ్యేటట్లు, వళ్లు గుల్ల అయ్యేటట్లు శ్రమపడుతున్నాను. అటువంటప్పుడు సుఖం అవసరంలేదా? నేను ఆనందాన్ని కోరుకోటానికి అర్హుడ్నికానా? చెప్పు! నిజం చెప్పు!! కష్టపడి శ్రమపడి ఇంటికి చేరుకుంటే ఇల్లు ఒక నరకంలాగ, ఇల్లాలు ఒక నల్లిలాగ కన్పిస్తుంది. అది నన్ను సుఖపెట్టలేక పోతుంది. నేను నలిగిపోతున్నాను. సంతోషానికి దూరమయిపోతున్నాను. “అదిమాత్రం ఏంచేస్తుంది?” అని అనుకుంటున్నానే గాని, దానిమీద జాలిరావడంలేదు. ఇష్టం కల్గటం లేదు. నాలో రాక్షసత్వం ఆవహించి నన్ను మానవత్వంనుంచి దిగజారుస్తోంది. ఇంతకముందు మంచివాడన్న లోకం నన్ను చెడ్డవాడని కొత్తనామకరణ చేస్తుంది. నాకెందుకో నవ్వొస్తుంది. నామీద నాకే జాలివేస్తుంది. నన్ను నేనే అసహ్యించుకోవలసి వస్తుంది.

నిర్మించుకున్న నిర్ణీత సమధులు చెరిగిపోయాయి. మంచి భావం విరిగిపోయింది. ఈ విధముగా ఎందుకయి పోతున్నానో? నాలో నేను ప్రశ్న వేసుకుంటే భయమేస్తుంది. నేను ప్రశ్న వేసుకుంటే భయమేస్తుంది. ఎంతో కాలం బ్రతకనేమో అన్పిస్తుంది. జీవితం మీద చిరాకు విసుగు వైరాగ్యం ఒక్కసారి కల్గుతాయి. మళ్లా వెంటనే సుఖం కోరుకోవాలని దాని కోసం బ్రతకాలనిపిస్తుంది. జీవితంకు "బ్రతకాలి చావాలి" మధ్య సంఘర్షణ పెద్దముడి విడకుండావుంది ఘర్షణ లోపల జరుగుతున్నంతకాలం మనిషినలిగి. పోతాడు. చివరకు ఎందుకూ కాక కాకుంచా పోతాను.

రామం! అది మొన్నె ఉత్తరం వ్రాసింది. చూశావా! నన్ను బాధ పడవద్దంటుంది. నన్ను సంతోషపరచటానికి తన సాయశక్తులా ప్రయత్నం చేస్తుందట. నాకోసం ఎంతేనా ప్రయత్నం చేస్తుందట? నన్ను సంతృప్తిపరచడానికెంత ఆలోచిస్తుందో? దాని ప్రయత్నంవల్ల మళ్లా మనిషి కాలేను. దాని ఆలోచన ఆనాందాన్ని అందివ్వలేదు. ఒక వేళ జరిగినా, అవి ఎడారిలో ఎండ మావులు... చీకటిలో మిణుగురు పురుగులు.

రామం! వెళ్తున్నా! ఎక్కడకని ప్రశ్న వేయకు! వేస్తే లోకం బాధపడుతుంది. నన్ను అసహ్యించుకుంటుంది. అచ్చటే అవినీకి, అసహ్యం, అసభ్యత వుంటాయి. కావలసినంత సుఖం దొరుకుతుంది. ఆ సుఖం కోసం పరిగెత్తుతున్నా... పడుతున్నా మోకాళ్లు పగులుతున్నాయి... అయినా ఫర్వాలేదు సుఖం లభ్యమవుతుంది. సుఖపడుతుంటే మీరంతా తిడతారెందుకు? నేను సుఖ పడటం మీకిష్టంలేదా? మీ ఇష్టాలతో నాకనవసరం... నేను సుఖపడాలి... అదే కావాలి... ఆ మార్గాన్నే నడుస్తున్నాను.

ప్రేమించిన దానికి యిద్దరు ఆడపిల్లలు. పెళ్ళిచేసుకుంటానన్న దానికింకా పెళ్ళికాలేదు. ఇప్పట్లో అవ్వదు. ఒక వేళ అయినా నాలాగ బాధపడుతుంది.

---

## ఆయనను మించినవాడే!

ఆ వూళ్లో ఒక పెద్దమనిషి వున్నాడు. చెప్పరానంత బద్ధకస్తుడు. తన దగ్గర పని చేయటానికి ఒక అబ్బాయిని కుదుర్చుకున్నాడు. ఆ అబ్బాయి బద్ధకంలో యజమానికన్నా రెండాకులు ఎక్కువగా చదివినవాడే! ...

యజమాని ఒక రోజున ఏదో తొందర పనిమీద ప్రక్క వూరికి వెళ్లాలసి వచ్చింది. నౌకరిని తను వేసుకునే పాదరక్షలని సిద్ధం చేసి వుంచమని ఆజ్ఞాపించి, ఆయన తన ముస్తాబు అయ్యాక చెప్పుల్ని వేసుకో బోయాడు. వాటిలో ఒకటి పెద్దది. మరొకటి చిన్నది. "ఇలా చేస్తూవుంటే పని పాటలు ఎలానేర్చుకో గలుగుతావు?" అంటూ ఆ పని అబ్బాయిమీద పడ్డాడు. కొంపమునిగి పోయిందని ఆ అబ్బాయి తెలుసుకుని "చిత్తం, చిత్తం. అయిందేమో అయింది. దానికోసం తమరు కోపపడటం ఎందుకు? ఇలాటి జతనే సామాన్లగదిలో చూశాను. వాటిని తెచ్చి పెడతాను. ఈ చిక్కును అప్పుడు మీరే చక్కచేసుకుంటారు. మా వూళ్లో పాదరక్షలు వుంటేగా, ఇలాటి చిక్కులని తేల్చటానికి మాకు వీలుంటుంది" అంటూ అమాయకంగా అనేసి, తిన్నగా ఆ జతను తీసుకుని రావడానికి ప్రక్కగదిలోకి నడిచాడు.

# శ్రీ రాముడు - శ్రీ సాయిబాబా

అనుసరణ : శ్రీ సి. సి. పున్నయ్య

[గత శ్రీరామనవమి మహోత్సవ సందర్భమున మద్రాసునందలి శ్రీ సాయినిలయంలో స్వామి కేశవయ్యజీ ఉపన్యాస భాగమిది.]

మనమందరము వీరుడు, పురాణ పురుషుడు, త్యాగమూర్తి, రక్షకుడుగా సత్యపాలనకొరకు, ధర్మసంస్థాపనార్థము పోరాడిన శ్రీరామచంద్రుని జన్మదినోత్సవము జరుపుకొనుట కిక్కడ సమావేశమయినాము. శ్రీరామచంద్రుడు దుష్టులను భయభ్రాంతులనుచేసి తన యశస్సును ఆచంద్రార్కముగా నిలుపుకొకలిగినాడు. ... ...

యుగయుగాలుగా శ్రీరాముని అవతారమూర్తిగా శ్రీ సాయిబాబా అనేక విధాల రక్షకుడుగా, మార్గదర్శిగా, పీడిత మానవలోకానికి తోడ్పడ్డాడు. అనేకులు ఆయనను ధ్యానమూలంగా గుహలలో విజ్ఞాన వితరణలతో అరయజూచారు. కాని ఆయన ఉద్రేకానికి, బుద్ధివికాసానికి అతీతమైన పవిత్ర హృదయాలలోను, గాఢాంధకారమున కావలి వెలుగులోను-ముక్తిసాధనద్వారా ఆయన నరయగలము. ఆయన నక్కడ చూడండి! తర్వాత ప్రతియొక్క మనుష్యునిలోను, ప్రతి మృగంలోను, ప్రతిమొక్కలోను, ప్రతిఘనిజంలోను, యావత్ప్రపంచములోను, సుఖ దుఃఖాలలోను, కీడు, అవమానములలో సయితము చూడగలరు. శ్రీ బాబాను అన్ని జీవరాసులలోను ఆరాధించండి! మానవసేవద్వారా ఆయనను సేవించండి! ఆకలిగొన్నవారి నేద దీర్చుట ద్వారా శ్రీ సాయిబాబాకు నివేదన చెల్లించండి! అవిద్య, అజ్ఞానపరుల ద్వారా ఆయనకు బోధించండి! కఠిన హృదయులై మీరంటే నిరసనభావం కలవారి ద్వారా ఆయనను ప్రేమించండి! మీ ఆత్మను ఆయన ఆలయంగా రూపొందించుకొని మీ చేతలు ఆయన సేవాత్యాగములుగా రూపొందించుకోండి! అహంను చంపుకొనిననాడు భగవత్సాక్షాత్కారమునుపొంది సాధారణ మానవత్వము నుండి దివ్య పురుషులుగా రూపొందగలరు. శ్రీ బాబా పవిత్రమూర్తిని, దివ్యసందేశమును, ఆదర్శ లక్ష్యాలను అవగాహనం చేసికొని ఆరాధించి, సేవించి, ఉత్తమోత్తమ జీవితములను రూపొందించుకొనుటవలన కుల, మత, వర్గ తత్వాల కతీతంగా శ్రీరామ, కృష్ణ, శివ, మారుత్యాది సర్వ భగవంతుని అవతారముల కరుణా కటాక్షములకు పాత్రులు కాగలరు.

---




# హాస్యమాడితే!

శ్రీ పిల్లా సుబ్బారావుశాస్త్రి

ప్రభాకరంగారు మొన్న యీ మధ్యనే పెళ్ళి చేసుకొని, భార్యతో పట్నంలో కాపురంపెట్టారు. అతని భార్య సీతలు. సీతలు పరి అమాయకురాలు. ఏమీఁతెలీదు ...! పల్లెటూరిపిల్ల ...! చదువు కూడలేదు. ప్రభాకరంగారు మాత్రం చదువుకున్న వారే! ఆయన చుట్టరికంవల్లగాని, కట్నంకోసంగానీ సీతల్ను చేసుకొని వుండాలి!

ఒక రోజు ప్రభాకరంగారు స్నానం చేస్తూవుండగా ఆయన కోసం యెవరోవచ్చారు. ఎవరో చూసేందుకు సీతలు వెళ్ళివచ్చింది—"ఏమండీ! మీకోసం యెవరో ఇనస్పెక్టర్‌గారు వచ్చారండీ!" అన్నది.

"నాకోసం ఇనస్పెక్టర్‌గారా? ... ఎందుకొచ్చారు చెప్మా?" అని ప్రభాకరంగారు ఆలోచించి "ఏదయినా సాక్షిసంతకం కావాలేమో ...! సరే, వెళ్ళి కూర్చోమనిచెప్పు!" అన్నారు. గబగబా స్నానం ముగించుకొని ... తువ్వాలుచుట్టుకు, తడితువ్వాలు మీదవేసుకొని, ... భార్యసీతలుకు రెండుకప్పుల కాఫీ తయారుచేయమని ఆర్డరేసి, బయటకు వెళ్లారు ప్రభాకరంగారు.

"నమస్కారం ... బాబయా!"—అన్నమాటలు విని...నిలువునా నీరయిపోయారు ప్రభాకరంగారు. ఆ వచ్చింది బిళ్లబంట్రోతు. అదిచూసి ఆయనకు నవ్వాల్నో ఏడవాల్నో అర్థమయిందిగాదు! వాడూ ... టోపీ...ఖాకీ యూనిఫారం చూసి సీతలు అలాగనుకున్నది!

"ఏరా! యిలా వచ్చావ్?" అనడిగారు.

"ఏం లేదు, బాబూ! ఈయాళ మేనేజరుగారు రారంట! టపా మిమ్మల్ను చూడమన్నారు." అని చెప్పాడు ప్యూన్.

ఇంతలో సీతలు రెండు కాఫీకప్పులూ తీసుకొని వచ్చి "ఏమండీ! ... కాఫీ ..." అన్నది. వెనక్కు పంపడం యిష్టంలేక ప్రభాకరంగారు వెళ్లిపోతున్న ప్యూన్‌ని — "స్టుపిడ్! కాఫీ తీసుకు వెళ్లు!" అని అన్నారు. — ప్యూన్ కాఫీత్రాగేసి వెళ్లిపోయాడు.

తర్వాత సీతలు ప్రభాకరంగార్కి అన్నంవడ్డించింది. ఆయన భోజనం చేస్తూవుండగా "ఏమండీ! ఇనస్పెక్టర్‌గారు ఎందుకొచ్చారు?" అనడిగింది సీతలు అమాయకంగా.

"ఏం ... లేదు! ఒక ఖూనీ కేసువుంటే... సాక్ష్యానికి!" అన్నాడు నవ్వుతూ ప్రభాకరంగారు.

"ఖూనీయే ...!" అని గుండెమీద చెయ్యేసుకుంది కళ్ళు పెద్దవిచేస్తూ! — మళ్లీ మరో ప్రశ్న వేసింది. "ఐతే, ఆయన్ను 'స్టుపిడ్' అన్నారే ... అర్థంయేమిటీ?" అనడిగింది సీతలు.

"Stupid ... అంటేనా? ... అంటే ... 'ఏమండీ' అని అర్థం!" అని హాస్యంగా జవాబిచ్చారు ప్రభాకరంగారు. "అలాగా!" అన్నది. అంతే ... !

ఒకరోజు ప్రభాకరంగారి ప్రాణమిత్రులు యిద్దరు ఆయనింటికి వచ్చారు. ప్రభాకరం వాళ్లని ఆరోజు తనింట్లో భోజనం చెయ్యమనికోరారు. 'సరే' అన్నారు వాళ్లు ... హోటల్ ఖర్చయినా తగ్గుతుందని!

"మిస్టర్ ప్రభా ... ! మనవాడు బి. ఎ. అమ్మాయిని చేసుకున్నాడు తెలుసా?" అన్నాడొక్క మిత్రుడు రెండో వాణ్ని చూపెట్టి.

"ఆఁ ... అలాగా!" అన్నాడు ప్రభాకరం గారు.

"మీ ఆవిడ ఎంతవరకూ?" అన్నాడు బి. ఎ. అమ్మాయి మొగుడు.

"అబ్బే ... ! పెద్ద చదువు చదవలేదు – ఎస్సెల్సీ ... ప్యాస్ అయింది!" అన్నారు ప్రభాకరంగారు.

వంట అయిందని చెప్పేందుకు వచ్చిన సీతలుకు చివరిసారిగా అన్నమాటలు – "ఎస్సెల్సీ ప్యాసయింది!" అన్నవి వినిపించాయి. తన భర్త తన గురించి ... అంతగా చెప్పి 'ఎస్సెల్సీ' ప్యాస్ అయ్యిందని చెబుతూవుంటే – తాను "ఏమండీ! వంట అయింది!" అనంటే బాగోదనుకుంది.

సీతలు చీర ఒక మారు సవరించుకొని, జుట్టుపైకి తీసుకొని – "స్టుపిడ్ ... ! మీల్సెరెడీ ... !" అన్నది.

"ఆఁ..." అంటూ నోరువెల్ల బెట్టారు ప్రభాకరం గారు. పళ్లు బైటబెట్టి కళ్లు తేలవేశారు అతని మిత్రులు. ముగ్గురివైపూ చూస్తూ ... కొయ్యబొమ్మలానుంచుండి పోయింది ... సీతలు పాపం!

ప్రభాకరంగారు హాస్యానికని అన్నమాట యెంత పనిచేసిందో చూడండీ! అసలు అర్థంఏమంటే ... బుర్రలేనివాడని, తెలివితక్కువవాడని, ఏమీరాని వాడని ... కొన్ని అర్థాలు ఉన్నాయి! ఆమెకేం తెల్సు ... అసలు సంగతి! "స్టుపిడ్" అంటే "ఏమండీ!" అనే అనుకున్నది! పాపం! ...

## పాత కొత్తలు

శ్రీ బచ్చల మునికన్నయ్య

చిత్తని గ్రామపు విద్యావ్యాప్తికి
చిన్న పాఠశాలొకటుంది.
పాఠశాలలో పిల్లలు కొల్లగ
పాఠాలు నేర్చుతూ వున్నారు.

నాల్గవతరగతి చదువుచుండిన
నళినీ తెలివిలొ మిన్నండి
పంతులుగారు గణితబోధనలో
నూతన లెక్కలు చెప్పారు.

నయాపైసలు ఒక రూపాయకు
నూరని బాగుగ చెప్పారు
కాలణాకు రెండు నయాపైసలు
ఖచ్చితముగ తెలియమన్నారు.

అందరు పిల్లలు అల్లరిచేయక
అవధానమును చూపారు
నళినీ బుర్రలొ సందియమొచ్చి
న్యాయరీతిలో అడిగింది.

# తిరుగుబాటు

'మాల్యాద్రి'

(గతసంచిక తరువాయి)

మో:—తాతయ్యా! ఏమిటావాగుడు? నీవు చెప్పే దేమిటో సూటిగా చెప్పెయ్యి. నే పడుకోవాలి.

తా:—పడుకో బాబూ! హాయిగాపడుకో! ఆ రంకు దానితో చెలిమి మానెయ్యి చినబాబూ!

మో:—ఆ! ఏమన్నావ్?

తా:—ఆతిలోత్తమ నాగుపాములాంటిది బాబూ.

మో:—నోరు ముయ్యి. దాసీ వెధవ.

(తాతయ్య మనస్సు ఎంతో బాధపడ్డది. కాని చిరునవ్వు మాటున ఆ బాధను మరుగు పరిచాడు)

తా:—ఎంతవాడి వైయావు బాబూ!

మో:—ఎవడిచ్చాడు నీకీ అధికారం?

తా:—మీ మేలుకోరి చెప్పటానికి యీ దాసి వెధవకు అధికారం లేదా బాబూ!

మో:—Nonsense-Shutup.

తా:—చినబాబూ! నీవా తిలోత్తమ దగ్గరకి పోవటానికి వీల్లేదు.

మో:—నీ వెవరు నాకు చెప్పేందుకు?

తా:—ఏమైనాసరే - యీ తాతయ్య బొందిలో ప్రాణం వుండగా మీరా చిన్నదాని గడప తొక్కటానికి వీల్లేదు.

మో:—అధికారం చలాయిస్తున్నావా?

తా:—మీ మేలుకోరి చెప్పటానికి నాకు సర్వాధికారం వుంది.

మో:—నీవు నాకు చెప్పక్కర్లేదు.

తా:—అయితే యీ తాతయ్య తలను మీ చేతులతో నే నరికి పారెయ్యండి. మీ పీడ వదలిపోతుంది. ఆ తరువాత మీయిష్టంవచ్చినట్లు చేసుకుందురుగాని.

మో:—..............

తా:—చెడిపోతూంటే నే చూడలేను చినబాబూ.

మో:—తాతయ్యా! నా ఆనందానికి అంతరాయం కలిగించవద్దు; అది నా యిష్టం.

తా:—చెడిపోతూంటే చూస్తూ వూరుకోవలసిందేనా బాబూ.

మో:—Nonsense. దాసీవెధవ! మితిమీరిపోయావు. యీయింటిలోనీవిక వుండక్కర్లేదు. Get out

(మోహన బాబు చేతికందిన వస్తువుతో తాతయ్య తలమీద కొట్టాడు)

తా:—ఎంతవాడివైయావు చినబాబూ! ఇంతవాడివి అవుతావని అనుకోలేదు. నే పెంచిన మమకారం— చెడిపోతూంటే చూస్తూవూరకుండలేకపోయాను. ఆనాడు ఏ చేతులైతే ప్రేమతో నా గొంతుకు పెనవేసుకున్నయో ఆ చేతులే యీనాడు నాతల పగులగొట్టాయి. పోతాలే చినబాబు. అట్లాగే పోతాలే. వస్తా బాబూ!

(తాతయ్య వెళ్లిపోయాడు)

(తాతయ్య వెళ్లిపోతూవుంటే మోహన బాబు అట్టేచూస్తూ కొంతసేపు వుండిపోయాడు. తాతయ్యను కొట్టినందుకు ఆతని హృదయం బాధపడుతూ వుంది. పడకమీద కూలబడిపోయాడు)

(కొంత సేపటికి సరళ ప్రవేశిస్తుంది. ఆమె ముచ్చటగా ముస్తాబై వుంది)

స:_ఏమండీ ! నే వెళుతున్నాను.

(సరళ పోతూవుంది–మోహన్ బాబుకు ఏమీ అర్థం కావటం లేదు)

మో:_ఎక్కడికి సరళా !

స:_.........

మో:_సరళా !

(సరళ ఆగిపోయింది)

మో:_ఎక్కడికా వెళ్ళటం ?

స:_ఎక్కడికైతే మీకెందుకు ?

మో:_యీనిశీధసమయంలో _ ఒంటరిగా - సరళా! ఎక్కడికి వెళ్ళటం ?

స:_నా యిచ్చవచ్చిన చోటికి.

మో:_ఏమిటా గడుసుతనం ?

స:_అవును అది నాయిష్టం. మీరాతిలోత్తమ వలపు లోపడి తందనాలాడటంలేదూ ? అలాగే నేను కూడా మరో పురుషుడిని ఎన్నుకొని నా జీవితాన్ని ఆనందమయం చేసుకుందామని వెళుతున్నాను. మీరు చెడిపోయారు. మీకోరకుగా నేనెందుకు కుళ్లి కృశించిపోవాలి? లోకంగొడ్డుపోయిందా ?

(మోహన్ బాబుకు మతి పోయినట్లైంది)

మో:_సరళా ! నీకు మతిపోయిందా ?

స:_లేదు

మో:_మరేమిటీ వాగుడు ?

స:_మీరు నా గొంతుకోస్తూవుంటే చూస్తూ వూరుకోవలసిందేనా ! నా సంసారంలో చిచ్చుపెట్టారు. నా కడుపు తరుక్కుపోతూంది. మీ యిచ్చవచ్చినట్లు మీరుచేయండి. నా యిష్టంవచ్చినట్లు నేను చేసుకుంటాను. అంతే.

మో:_సిగ్గులేదూ ?

స:_సిగ్గు ! మీకులేనప్పుడు నాకుమాత్రం ఎందుకు?

మో:_వ్యభిచారం చేస్తావా ?

స:_అవును చేయవలసిన అగత్యంవచ్చింది. చేయబోతున్నాను. నా ఆనందానికి అంతరాయం కలిగించకండి.

మో:_దుర్బుద్ధి పుట్టింది.

స:-దుర్బుద్ధి పుట్టింది మీకో నాకో బాగాఆలోచించుకొని మాట్లాడండి. ఒకవేళ నాకే దుర్బుద్ధి పుట్టిఉంటే ఆ తప్పుమీది; నాదికాదు.

(సరళ పోతూవుంది)

మో:_సరళా ! ఆగు !

స:_ఇక ఆగటానికి వీలులేదు. వ్యభిచారం! మీరు చేయటంలేదూ ? అలాగే నేనూ చేస్తాను. ఆ హక్కు నాకూవుంది. "యధారాజా తధా ప్రజా !" తప్పేమిటి ?

మో:_బ్రతకాలని యిష్టంలేదు కాబోలు.

స:_ఏం ! చంపేస్తారా ?

మో:_మెడ నులిమి పారేస్తాను.

స:_తరువాత ఆ రంకుదానితో విచ్చలవిడిగా తిరగొచ్చు. నులిమెయ్యండి.

మో:_నులిమేస్తాను. పీడవదలి పోతుంది.

(మోహన్ బాబు సరళను సమీపించాడు. ఆవేశంతో ఆమె మెడను నులిమేస్తున్నాడు)

(సమయానికి "ముసుగుమనిషి" ప్రవేశించాడు)

మ:_ఆగు !

(మోహన్‌బాబు ఆగిపోయాడు)

ము:_ఏమిటా తొందర ?

మో:_వెళ్లుతుందిట.

ము:_వెళ్లనీ ! ఆమెను వెళ్లనీ.

మో:_ఎక్కడికి ?

ము:_ఆమె యిచ్చవచ్చినచోటికి.

మో:_వ్యభిచారం చేయటానికా ?

ము:_అవును నీవు చేయటంలేదూ వ్యభిచారం ? అలాగే ఆమెకూడా చేస్తుంది. నీకే అధికారం వున్నప్పుడు ఆమెకు మాత్రం ఆ అధికారం ఎందుకువుండకూడదూ ? నీవు నేర్పిన విద్యయె." చెల్లీ ! నీవు వెళ్ళమ్మా ! వెళ్లు. నీయిచ్చవచ్చిన చోటికి వెళ్లు.

(మోహన్ బాబు, సరళ, నిర్ఘాంత పోయి చూస్తున్నారు)

ము:_ఏమిటి చెల్లీ! అలా వుండిపోయావ్ ? భయపడు తున్నావా ? నేను నీమేలుకోరి వచ్చాను. భయ పడకు.

(ముసుగుమనిషి ముసుగును తొలగించాడు)

మో:_ఆ ! నీవా ?

ము:_అవును నేనే. డ్యాన్స్ మాస్టర్ "సుధాకర్" చెల్లీ ! నీవు వెళ్లమ్మా ! నీ యిచ్చవచ్చినచోటికి వెళ్లు.

మో:_వెళ్లటానికి వీలులేదు.

ము:_వెళ్ళటానికి ఆమెకు సర్వాధికారంవుంది. ఆమెను ఆటంకపరిచే యోగ్యత ప్రస్తుతంనీలో లేదు.

మో:_ఆ ! ఏమన్నావ్ ?

ము:_అవును నీవు చెడిపోయావ్. నీవు పశ్చాత్తాప పడాలి, మారిపోవాలి. అంతవరకు ఆమెమీద అధికారం చలాయించేయోగ్యత నీకులేదు.

(తాతయ్య, యలమంద ప్రవేశించారు)

తాతయ్య:_అవును బాబూ నీవా దుర్బుద్ధిమాను.

మో:_సుధాకర్ ! నీ విక్కడికెందుకొచ్చావ్ ?

ము:_మీయలమందనే అడుగు తెలుస్తుంది. నీరక్తాన్ని గటగటత్రాగి నా ఆకలిని తీర్చుకుందామన్నంత కర్కశ హృదయంతో నేను యిక్కడికివచ్చాను. కాని ఆ యిల్లాలి ముఖం చూచాను. నాకర్కశ హృదయం కరిగిపోయింది.

(ముసుగు మనిషి చేతనున్న బాకును క్రిందపారేశాడు)

చెల్లీ ! నన్ను క్షమించు. నేను కళారాధకుడ్ని, పచ్చినెత్తురు త్రాగే హంతకుడ్నికాదు. కాని నీ భర్తయొక్క అమానుష ప్రవర్తన నన్నొక హంతకుడ్నిగా మార్చి పారశేసింది. నాకే సిగ్గ వుతూంది. కాని గత్యంతరంలేదు మారిపోయాను. మోహన్‌బాబూ ! ఏమిటలా చూస్తూవుండి పోయావ్ ? యీ తప్పునీదికాదూ ?

మో:_.... ............

ము:_నాకడుపులో చిచ్చుపెట్టావ్. నాబ్రతుకు బరువు పోయింది. పిచ్చివాడినై పోయాను. నా మతి పోయింది. ఆకలితో నాకడుపు దహించుకు పోతూవుంది. నా ముఖం చూచేవారెవ్వరూ లేరు.

మో:_సుధాకర్ !

ము:_మోహన్ బాబూ ! అతిలోత్తమే నాకీ ప్రపం చంలో ఆధారం. చిన్నప్పటినుంచి దానికి నాట్యం నేర్పాను. సంగీతం నేర్పాను. నాలోవున్న

కళానైపుణ్యాన్ని నూరిపోశాను. ఆతిలోత్తమను ఆధారంచేసుకొని నాటకాలని, నాట్యాలని పొట్టపోసుకుంటూవున్నాను. ఆతిలోత్తమను కాస్తా గద్దలాగా అంతరిక్షానికి తన్నుకపోయావ్. నాట్యాలు ఆగిపోయాయి. నాటకాలు నిల్చిపోయాయి. నాబ్రతుకుదెరువు పోయింది. చూడు! నాదుస్థితి! నన్నుచూస్తే అర్ధంకావటంలేదూ?

మో:—..................

ము:—తిలోత్తమ విశ్వాసఘాతకురాలు. కాని నీ సంస్కృతి, నీ గొప్పతనం, నీ తెలివితేటలు, ఏమైపోయాయి మోహన్ బాబూ.

మో:—............

ము:—మోహన్ బాబూ! నాకుకావలసింది నా తిలోత్తమ. నీవాతిలోత్తమను మరచిపో నానోట్లో దుమ్ముకొట్టొద్దు. ఆ యిల్లాలి కడుపులో చిచ్చుపెట్టొద్దు. చూడుపాపం! అభమూ శుభమూ ఎరుగని ఆమె హృదయం ఏలాకుమిలి పోతూ వుందో! మీతాతయ్యని చూడు. పెంచినమమకారం. ఆ గుండెలు ఏలాతల్లడిల్లి పోతున్నాయో! నా స్థితిచూడు. పొట్ట గడవక ఏలాబాధపడుతున్నానో! ఆతిలోత్తమను మరచిపో, తరువాత ఆవిశ్వాసఘాతకురాలిపని నేనుపడతాను.

మో:—ఆ!

ము:—ఏమిటి మోహన్ బాబూ! ఆవిశ్వాసఘాతకురాలిని నేనుమాత్రం ఎందుకు వదిలెయ్యకూడదు అంటావా? అవును అడగవలసిన ప్రశ్న. నేనాతిలోత్తమను ఆరాధించక తప్పదు. యీ పొట్టకోసం ఆతిలోత్తమను పట్టుకొని ప్రాకులాడాలి. అది నాగ్రహచారం. ఈ ప్రపంచంలో ఆతిలోత్తమ తప్పనాకు మరే ఆధారమూలేదు. "తిలోత్తమవిశ్వాసఘాతకురాలైనాసరే ఆమెనే. నీవు ఆరాధించాలి" అని బ్రహ్మ నానొసట వ్రాశాడు. ఇక గత్యంతరంలేదు. నీకేంబాబూ! జానకీదేవిలాంటి యిల్లాలు. ఆస్తి — పాస్తి, పేరూ ప్రతిష్ట — నీవు చెడిపోతే వీళ్ళంతా కంటతడి పెడతారు. కాని నాకొఱకు ఏడ్చేవాళ్లు యీ ప్రపంచంలో ఎవ్వరులేరు. నేనుఏకాకిని నాకునేనే. అర్థమైందాబాబూ?

మో:—..........

ము:—నీ వెక్కడ నేనెక్కడ. యీ సుధాకర్ పొట్టగడవక ప్రాకులాడుతూవున్న ఒక నిర్భాగ్యుడు. ఆతిలోత్తమ నీ అంతస్థుకు సరిపోదు; వదిలెయ్యమన్నాను. అది విశ్వాసఘాతకురాలు.

మో:—సుధాకర్! పశ్చాత్తాపపడుతున్నాను. నన్ను క్షమించు. ఇక ఆతిలోత్తమను కన్నెత్తియైనచూడను.

ము:—చెల్లీ! చినబాబు మారిపోయాడు. నీమీద అధికారం చలాయించటానికి ఆయనకిప్పుడు సర్వాధికారంవుంది. నీవు గడపదాటటానికి వీలులేదు.

తా:—చినబాబూ!

మో:—తాతా! నీమాటలు అర్థం చేసుకోలేక పోయాను.

తా:—పోనీలేబాబూ! యిప్పుడేమైందికనుక.

ము:—చెల్లీ! తెలివితేటలంటే నీవేనమ్మా. ప్రపంచంలో ఎంతోమంది యిల్లాండ్రు నీలాగే బాధపడుతూ లోలోపల కుళ్ళి, కుమిలిపోతున్నారు. కానిసాహసించి తెలివితేటలు ప్రయోగించి భర్తలను రక్షించుకున్న వారు చాలా అరుదు. సాహసమంటే నీదేనమ్మా. మోహనబాబూ! సెలవు. చెల్లీ! వస్తానమ్మా. రావయ్యా తాతయ్యా! యిది భార్య భర్తల మధ్యని చెలరేగిన తిరుగుబాటు. యీ తిరుగుబాట్లు మొదటమొదట అగ్నిపర్వతాల్లాగా అమాంతంగా విరుచుకపడతాయి.

య:_కొంతసేపటికి ఆ అగ్ని పర్వతాలు వాటంతట అవే మంచుగడ్డల్లాగా కరిగి చల్లబడి కూకుంటాయి. ఇటువంటి యవారాల్లో జోక్యంకలిగించుకోటం వట్టి ఎర్రితనం – రామామాగాపోదాం.

తా:_అమ్మయ్యా ! గండంగడిచింది.

(ముసుగు మనిషి, తాతయ్య యల మంద, వెళ్లిపోయారు)

మో:-సరళా ! నన్ను క్షమించు.

స:_క్షమించండి. వినయవిధేయతలు విడిచి మాటాడాను.

మో:_కాబట్టే అఖాతంలో పడబోతున్న నేను రక్షింపబడ్డాను.

స:_తుఫాన్ ఆగిపోయింది.

మో:_ఎంతలో ఎంతటి తిరుగుబాటు లేవదీశావు ! నీ తెలివితేటలను యీనాడు గ్రహించాను. సరళా ! వెళతావా ?

స:-ఎక్కడికి?

మో:_నీయిచ్చవచ్చిన చోటికి.

స:-అబ్బా ! చాల్లేద్దురూ

# వాళ్ళనలా వదిలేద్దాం

శ్రీ నేమాని సంగమేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

"ఏమమ్మా! ఒంట్లో అదోలావున్నట్లు కనిపిస్తున్నావ్!" తల్లిలాలనగా అడిగింది.

మౌనంగా వూరుకుంది.

"కళ్లు ఎఱ్ఱగావున్నాయేవమ్మా! రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదూ?"

నిజమే తనకు రాత్రి అసలే నిద్రపట్టలేదు. 3½ గంటలవరకు పిచ్చి ఆలోచనలతో మధనపడసాగింది. ఆ తరువాత కొంచెం నిద్రపట్టింది. అయినా అది దాచడానికి ప్రయత్నిస్తూ "అబ్బే! రాత్రిబాగానే నిద్రపట్టిందమ్మా!......ఇప్పుడు సోపుతో ముఖం కడుకున్నాను కదూ ... నుగురు కొంచెం కళ్లలో పడ్డాది...అందుకు....!" ఇది అబద్ధం అని పైకి తెలిసిపోతున్నాది.

తల్లి ప్రేమతో తన శరీరంచుట్టూ చేతులు వేసి ఒకమారునిమిరి "పిచ్చిపిల్ల" అని అనుకోవడం విన్నాది దమయంతి.

"అమ్మాయ్! నిన్న మన యింటికి ప్రభాకరు వచ్చేడట – నాకు చెప్పవేశా దేమిటమ్మా"? అంది తల్లి.

"అతను ఎవరో నాకు తెలియదమ్మా! అన్నయ్య హడావిడిగా మేడమీద నాగది లోకివచ్చి అతని దగ్గర నన్ను పాడమని బలవంతచేసేడు – అతను నా పాటను చాల మెచ్చుకున్నాడమ్మా!" అంది దమయంతి వుత్సాహంగా.

"చాల మంచివాడమ్మా! వాళ్ల కుటుంబము అంతా మంచిదే!" అంది తల్లి గుట్టు తెలుసుకుందుకు "మంచివాడు లాగే కనపడుతున్నాడమ్మా" అంది దమయంతి మెరుస్తున్నకళ్ళతో. దమయంతి లేచింది.

లేస్తున్న కూతురుని చూసి 'అమ్మాయ్' అంది తల్లి.

ఆగింది దమయంతి.

తనలో ఏమాలోచించుకుందో "ఏమీ లేదమ్మా! నువ్వువెళ్లు" అని వంటింటి లోకి నడిచింది తల్లి.

దమయంతి మేడమీద తన గదిలోకి బయలు దేరింది. "ఎందుకు తల్లి తెచ్చింది ప్రభాకరుని ప్రస్తావన" అని తలపోస్తూ మెట్లు ఒక్కొక్కటే ఎక్కుతున్నాది. తన బలహీనత వల్ల కాబోలు మెట్లు ఎత్తు ఎక్కువ పెరిగినట్లు కనిపించేయ్ దమయంతికి. భారంగా నడుస్తూ తనగది చేరుకుంది.

టేబిలు దగ్గర కుర్చీలో కూర్చుంది. అక్కడేవున్న లెటర్ పేడ్, ...పౌంటెన్ పెన్ను తీసింది. "ప్ర భా క ర ం ......ప్రేమ...... ద మ య ం తి ... స్వభావం ... ...దిగులు .... .... విరహం ... ...దమయంతి ... ... ప్రభాకరం..." యిలాగ ఏమిటో పిచ్చిరాతలు, వంకర టింకర గీతలు గీసింది.

కాగితం "పేడ్" నుంచి చింపింది. తీసి చదివింది. ... నవ్వుకుంది పిచ్చిరాతలకి. ఆ కాగితాన్ని ముక్కలకింద చించేసి నలిపి కిటికీలోంచి పారేసింది.

లేచింది అన్నయ్యగదిలోకి వెళ్లింది. అన్నయ్యలేడు. ఎనిమిదిగంటలకే ఎక్కడికో వెళ్లిపోయేడు. "షెల్ఫు"లో ఉన్న కొన్ని పుస్తకాలు తీసి చూసింది. మళ్లా వాటిని యథాస్థానములో వుంచేసింది.

మంచము మీద కొంత చిల్లర కొన్ని యిచ్చు రూపాయిలు కనిపించేయ్! రాత్రి అన్నయ్య బట్టలు మార్చుకోకుండా పడుకున్నాడు కాబోలు! అవి జేబులోంచి పడిపోయి వుంటాయ్. అంతా చేర్చి టేబిలు మీద దొంతి పెట్టింది. బయటకు వస్తూ వుంటే ద్వారమందానికి చెయ్యి తగిలి ఒక గాజుపగిలింది! చిన్న సంకోచపూర్వకమయిన వ్యథను పొందింది దమయంతి!

కూర్చొని విరిగిపోయిన ముక్కలన్నీ ఏరింది. ఒక సెకండు ఆలోచించి ఆముక్కలను కిటికీలోంచి బయటకు పారేసింది.

ఏదో బాధ? ఏం బాధ యిది? తనకేమీ అర్థమవడం లేదు. ఇవాళ ఏదయినా సినీమాకు వెళితే బాగుంటుంది! "మేటనీకి" వెళితే 6½ గంటలకు తిరిగి రావచ్చు.

ప్రభాకరం కూడా తనతో వస్తే బాగుంటుంది అని అనిపించింది. ఏమో! తనకి తెలియకుండానే రాకూడదా? ఆ! ఎందుకువస్తాడు? ఎందుకురాకూడదూ? ఎందుకో ఎప్పుడూ లేంది తనమనసు యివాళ పురుషుని వాంఛిస్తున్నాదేమో? దీనికి కారణ మేమిటో!

అన్నయ్య వూరుకున్నవాడు వూరుకోకుండా తనని ప్రభాకరానికి పరిచయంచేసి ప్రభాకరం ఎదుట తనని ఎందుకు పాడమనాలి? అతను తన పాటనువిని మెచ్చుకోవడం ఎందుకు? భోజనాల దగ్గర నాన్నగారుకూడా అన్నారు "ప్రభాకరం మంచివాడు" అని. మంచివాడు కాకపోతే ఎందుకంటారు. తన మనస్సు ప్రభాకరాన్ని కోరుతున్నాది అని ఇవాళ గ్రహించగలిగింది దమయంతి!

ఇందాక అమ్మకూడా అంది మంచివాడని. మంచివాడు అంటే అర్థంవమిటి ఏమిమంచి వుంది అతనిలో?

తనగదిలో ప్రవేశించి ఆరోజు దిన

పత్రిక తిరగవెయ్యనారంభించింది దమయంతి. మొదట పేజీలోనే "సూళ్లూరుపేటలో ఒకయువతి ఆత్మహత్య" అనివున్న హెడ్డింగు చూడగానే ఆతృతతో చదువసాగింది.

"సూళ్లూరుపేటలో తన తల్లిదండ్రులు తనుప్రేమించిన యువకునితో వివాహము చేయకుండా ఇంకొక ముసలివానితో సంబంధము చేస్తున్నారని రాజమ్మ అనే తమిళయువతి (వయస్సు 18 సం) నిన్న సాయంత్రము నూతిలోపడి ఆత్మహత్య చేసుకుంది......."

"పాపం! ఆదీనురాలి ఆత్మశాంతికై ఒక్క అశ్రుకణం దమయంతి రాల్చగలిగింది! అంతకన్న యేంచెయ్యగలదు! తెలివితక్కువది కాకపోతే ఆత్మహత్య చేసుకోవడం ఎందుకు? చచ్చి ఎవరిని సాధించగలదు? అయినా తల్లిదండ్రులకు బుద్ధి వుండక్కరలేదూ? ఆప్రేమించిన వానితో కాక ఒకముసలివానితో వివాహంచేయబోతారా? మూర్ఖులు! అనవసరంగా కూతుర్ని చంపేసుకున్నారు!

ఏమిటో ఈ జీవితాలు! వీటి సమస్యలు! వాటి పరిసమాప్తులు !......విచారించేవారు కొందరు! ఆనందించేవారు కొందరు! అనుభవించేది కొందరు! అనుభవింపజేసేవారు కొందరు !......కొందరు.......కొందరు ......కొందరు......

ఏమో! మనం ఊహించినట్టు ఏదీ జరుగదు! .. ...." ఇలా ఆలోచిస్తూ షెల్ఫుదగ్గరకు నడిచి పుస్తకాలుసర్దుకొంది దమయంతి. ఇవాళ మళ్లా కాలేజీకి బయలు దేరింది!

ఈ మధ్య చదువుమీద ఉత్సాహం తగ్గడం వల్ల వారం, పదిరోజులయింది కాలేజీకి వెళ్లడం మానేసింది......

5

కాలప్రవాహంలో కొన్ని రోజులు, మాసములు గతించేయి. ఇలాంటి మానసిక వ్యధలతో, సమస్యలతో దమయంతి బ్రతుకును దిగుల్తో వెళ్ళబుచ్చుతున్నాది!

ఒకనాటి సాయంత్రము ఎప్పుడూ తన గదికిరాని తండ్రి ఆ నాడు తన గదికి రావడం దమయంతిని ఆశ్చర్యపరచింది!

"ఏంనాన్నా! ఇలా వచ్చేవ్! రా! కూర్చో." అంటూ యీజీఛైరు ముందుకి లాగింది.

కూర్చుంటూ "ఒక్క నిముషమే అమ్మాయ్" అన్నాడు తండ్రి.

తను నిశ్శబ్దముగా కిటికీ వూచలలోంచి దూరంగావున్న కొబ్బరిచెట్లు చూస్తున్నాది.

"అమ్మాయ్ నువ్వు! యింక చదువు, సంధ్య ఆపివేయి తల్లీ! నీకు యిష్టం

ప్రేమ, ఉంది అని గ్రహించే ప్రభాకరు నితో నీ వివాహం నిశ్చయించేను అమ్మా!'' అన్నాడు.

తను మౌనంగా నిలబడి వింటున్నాది.

''అమ్మా! నీ సౌఖ్యమే మా సౌఖ్యం అంతకంటే మేము కోరేది ఏదీ వుండదు! ఇష్టపడ్డానని చెపుతేగాని నా మనస్సుకు సంతృప్తిగా వుండదమ్మా'' ... అన్నాడు వృద్ధుడు ప్రేమ, కరుణ, ఉట్టిపడుతున్నట్టుగా.

తనకు యిటువంటి తండ్రిని ప్రసాదించినందుకు ఆ భగవంతుడికి నమస్కరించింది తనలో.

''నీ యిష్టమే నా యిష్టం నాన్నా!'' అని మాత్రం బయటకు అనగలిగింది వంగి తండ్రి పాదాలకు నమస్కరిస్తూ.

''హాయిగా కలకాలం బిడ్డలతో సుఖంగళిగా జీవించు తల్లీ'' అని ఆ వృద్ధుడు దీవించి తన కంటివెంట వస్తున్న ఆనంద బాష్పాలను తుడుచుకుంటున్నాడు. ఎందుకో అతని శరీరం వణకుతున్నాది. మెల్లిగా దిగి కిందికి వెళ్ళేడు!

మర్నాడు సాయంకాలం కొన్ని ఇన్విటేషను కార్డులు సీతచేత దమయంతికి పంపేడు తండ్రి, స్నేహితురాండ్రకు పంపమని.

కార్డులు చూసింది! అందంగానే వున్నాయి! మీదను తన పేరు, క్రింద ప్రభాకరరావు పేరు వుండి, మధ్యను "with" అని వుండడం గుర్తించింది. ఇప్పుడు ఈ "with" కి ప్రపంచములో దేనికీలేని బరువూ, విలువావచ్చినట్లున్నాయ్!

పెళ్ళి నిశ్చయించేరు కాబట్టే ఆరోజున అమ్మ ప్రభాకారుని ప్రస్తావన యెత్తింది అన్నమాట!

తనకి ఏదో దిగులు పట్టుకుంది అని అనుకుంది.

ఈ పెళ్ళి తనకిష్టంలేనట్టు భావించింది! తనకి అసలు పెళ్ళి చేసుకోవాలనే లేదేమో! అయితే ఈ పెళ్ళికి ప్రతిఘటిస్తే! తన పిచ్చిగాని ప్రతిఘటన ఎందుకు?

మళ్ళీ తనలో తాను ఈ పెళ్ళికి ఆమోదం చూపింది! తన యిష్టంమీదే తల్లిదండ్రులు ఈ పెళ్ళి చేస్తున్నారు.

నిజంగా తను యిష్టపడ్డదా? ఏమో? తన మనస్సు ఎప్పుడయితే ప్రభాకరాన్ని వాంఛించిందో అప్పుడే యిష్టపడ్డదన్నమాట!

ప్రభాకరాన్ని వారం రోజుల క్రిందటే చూడడం! అనాటినుండీ మరి అతను రాలేదు! ఎందుకురాలేదు? ఏమో? తన గురించి అయినా వస్తాడనుకుంది! కాని అతనురాలేదు—!

తనకి ప్రభాకరం కావాలని తను తెలుసుకోగలిగింది. కాని ప్రభాకరానికి తను కావాలో? వద్దో! ఏం! తనకంటె అందకత్తె, విద్యావతి, సుగుణవతి దొరకుతుందా? తను నిజంగా అందంగాలేదూ?

(సశేషము)

# "మాలపల్లి"లో లక్ష్మమ్మ

శ్రీమతి దేశిరాజు భారతీదేవి

మాలపల్లి యొక చక్కని సాంఘిక నవల. రచయిత శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు. "జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల" అను సామ్యమున శ్రీ పంతులుగారాంధ్ర దేశమున గత అరువది వత్సరములుగా సుప్రసిద్ధ సంఘ సంస్కర్తలుగా, రాజకీయజ్ఞులుగా, కార్యాచరణ శీలురుగా, రచయితలుగా తెలుగువారికి సుపరిచితులు. కావున వారినిగూర్చి చెప్పుట చర్విత చర్వణమగును. సంఘ సంస్కరణ దీక్షాపరులగు పంతులుగారు తమ అనుభవమున కష్టజీవులగోడు, పలుకుబడిగల్గిన ధనాధికులగు భూస్వాముల చర్యలు, బీదసాదల దుర్భరస్థితి కన్నులారచూచి సంఘపరిస్థితు లెట్లున్నవో తెల్పుటకే "మాలపల్లి" రచించిరి. అందులో పంతులుగారనేక విషయముల గురించి వ్రాసిరి. పామరజన విశ్వాసము మొదలు అద్వైత సిద్ధాంతమువరకుగల సమస్త విషయములు చర్చించుటేగాక కూలిజేసి ధనికుల ధనాగారములనింపు పాటకుల కష్టములు, తన్నివారణ మార్గములు, యజమానులుచేయు అక్రమ చర్యలు భరించి, భరించి దుస్సహదశకు వచ్చినపుడు వారెట్లు విప్లవము సాగింతురో యిందు వ్యక్తము చేసిరి.

శ్రీ పంతులుగారి "మాలపల్లి" ప్రచురణ నిరోధించుచు ఆంగ్లపరిపాలకులు నిషేధాజ్ఞ జేయుటచేత అందలి విప్లవాత్మక భావపరంపరపై అప్పటి ప్రభుత్వ మాందోళన జెందినదని తెలియుచున్నది. "మాలపల్లి" రచనాకాలమున దేశ, సంఘ పరిస్థితులెట్లున్నవో తెలిసికొన్నగాని అట్టి గ్రంధ రచనావశ్యకత, రచనోద్దేశ్యము తెలిసికొనలేము. ప్రథమ ప్రపంచ యుద్ధము ముగిసి, దాని ఫలితముగా జనించిన స్వాతంత్ర్య పిపాసకుల సంతుష్టిపరచక ప్రభుత్వము పంజాబులో కొన్ని దురంతములు జరుపుట, తన్మూలమున దేశములో విప్లవము చెలరేగుట, గాంధీమహాత్ముడు సహాయ నిరాకరణోద్యమము సాగించుట, అశాంతి సమరమున దేశారాధకులనేకులు చెఱసాలల కేగుట మున్నగు క్లిష్టపరిస్థితులలో "మాలపల్లి" రచింపబడినదని చెప్పనొప్పు, ఇక రచనోద్దేశ్యము గ్రాహ్యమే.

చౌదరియను నొక ధనికభూస్వామి భార్య లక్ష్మమ్మ. రామానాయుడు వీరి పుత్రుడు, సంగదాసు వీరి గుమాస్తా. రామదాసు కుటుంబములోని వారందరు చౌదరిగారికి విశ్వాస పాత్రులుగానుండి వారి పొలములో పనులుచేయుచుండిరి. లక్ష్మమ్మ ఉదార స్వభావముగల్గి, దానధర్మ పరత్వము, బీదసాదల యెడదీయ, నిరహంకార చిత్తవృత్తిగల్గి, పూర్వ సాంప్రదాయము ప్రకారము సంఘసేవ నొకవిధముగాచేయు నుత్తమ యిల్లాలు. చౌదరిది కఠిన స్వభావము. ధనార్జనమే ముఖ్యోద్దేశ్యముగా కూలీల యెడ నిరంకుశ ప్రవర్తనగలవాడు. ఈ భార్యాభర్తలకుగల గుణవిభేదమునుబట్టి గ్రామస్థులు లక్ష్మమ్మయందే గౌరవము జూపుచుండిరి. పంతులుగారి వర్ణన ప్రకారము పచ్చి పసుపు కొమ్ములాటి శరీరచ్ఛాయతో, స్వయంగా నూలువడికి నేయించుకొన్న ముదుకచీరెతో, పెద్ద కుంకుమబొట్టుతో, కాళ్ళకు పసుపు, చేతులకు మెడకు గంధపు పూతతో, బొగడలు, తిరుగుడుపువ్వు, గళ్ళాపట్టెడ, పసిడి నల్లలు, సవరపెప్పె, గోట్లు మున్నగు పూర్వకాలపు అలంకారములతో, సగము నెఱసిన వెంట్రుకలతో కలకళ్లాడుచు శోభాయమానమైన ఆమె స్వరూపములో ఆమె జాతీయత మూర్తీభవించిన ఆంధ్ర పురంధ్రిగా మనకు గోచరించును.

ఈ సాధ్వి ఉదారగుణమువల్లనే బావ కొడుకైన వెంకటయ్యనుకూడా తన కుమారునితో సమానముగా పెంచినదట. బీదసాదలయెడ నీమె ప్రవర్తన మెట్టిదో తెలిసికొనవలెనంటే "మాలపల్లి"లో కొన్ని ఘట్టాలనే యెత్తి వ్రాయవలసి వచ్చునేమో! ఏవేళనైనాసరే "అమ్మా ఆకలి" అనే ఆర్తనాదం ఆమె

చెవులబడినదంటే ఆ యిల్లాలు సహించలేదు. వెంటనే యింత అన్నం మజ్జిగలోగలిపి వెయ్యవలసిదేం. "అన్నపూర్ణను నుద్దియే అతని గృహిణి" అన్న పెద్ద నార్యునివాక్కు లీమె యెడ సార్థకములు, కాని చౌదరి మాత్రము భార్య నిత్యము అన్నదానం చేస్తుందని, మజ్జిగ ఊళ్ళో అందరికి పంచిపోస్తున్నదని కోపగించుకునేవాడు. ఒక నాడు యింట్లోవున్న పశువుల నమ్మివేస్తానన్నాడు అందుకా గృహిణి యేమన్నదో వినండి.

"తిరిపెపు నీళ్లు పోయవలసి వస్తుందనేనా ? ఊళ్ళో ప్రతివాళ్ళకు గొడ్లుంటవా ? వాళ్లంతా వట్టి కూడు తినవలసిందేనా ? మన పంతులికి గేదెల్లేవు గదా ? చుట్టమొచ్చినా పక్కమొచ్చినా కొంచెము మజ్జిగ నీళ్లైనా పుట్టనియ్యకపోతే యెందుకీపెద్ద సంసారాలు ? " అంతచౌదరి "అన్న సత్రం అవిచ్ఛిన్నంగా జరుగవలసిందేనా ?" అన్నాడట.

దారిన పొయ్యేవాడు ఆకలికి చెవులు గడియలుపడి "గంజినీళ్లు పొయ్యమ్మా అంటే యింత మజ్జిగ అన్నం కలిపివేస్తున్నాను. తక్కిన ఖర్చంతా లాభమూను యిది మాత్రం దుబారానా ? ఇంతకాలము యెట్లాగో జరిగిపోయింది. నాకు కాలము దగ్గఱకొచ్చింది. యీ నాల్గురోజులు యిట్లాగే సాగిపోనియ్యండి"అని"మళ్లీ మీ కోడలు మేడమీదనుండి క్రిందకే దిగదు. తర్వాత వీరు పెట్టేదీలేదు వారు తినేదిలేదు"అన్న దామె. దానధర్మాలు చేయడంలో ఆమె నిశ్చితాభిప్రాయాన్ని యెంత దృఢంగా చెప్పిందో తెలుస్తుంది. పాడిలేనివాళ్ళకు పాడివున్నవాళ్లు మజ్జిగ విధిగాపోసితీరాలనే ఆమె అభిప్రాయం. సామ్యవాద సిద్ధాంతమే యనుటకు సందియములేదు. అంతేగాదు తన తర్వాత తన కోడలు తన మోస్తరు అన్నదానం చెయ్యదేమోనని వాపోయింద్యా యిల్లాలు.

ధనిక దరిద్రతా తారతమ్య మామెకొంతయు లేదనుటకు తార్కాణము. ఒకనాడొక ముదుసలి వచ్చి "ఓ, లచ్చక్క దొరసానీ యింత గంజి పొయ్యమ్మా ! ఆకలికి ప్రాణం పోతున్నది." అని ఆక్రందనం చేస్తుంది. వెంటనే లక్ష్మమ్మ గంజి పోస్తుంది. కొన్ని రోజులుగా ఆహారము లేకుండుటచే గొంతు మ్రింగుడుపడక వుక్కిరి బిక్కిరై పోయిందట. తల్లీకొడుకు లామె కుపచారములు చేసి, సేదదీర్చి, అన్నంపెట్టి, ఆదరించిన ఘట్టము లక్ష్మమ్మ హృదయ వైశాల్యమునకు నిదర్శనము. అట్టి జాలిగుండెగల తల్లికి పుట్టిన బిడ్డ గనుకనే బీదల బాధలు స్వయముగా తెలిసికొని తన సర్వస్వము వారి సేవకే సమర్పించి జన్మసార్థకత గాంచినాడు.

లక్ష్మమ్మ ధైర్యసాహసములు చౌదరి సంగదానును చంపినపుడు వెల్లడయినవి. సంగదాసు క్రిందపడిపోవగనే మాలలందరూ కఱ్ఱలుదీసికొని "ఏడీ చౌదరయ్య యేడీ" అంటూ చౌదరిని చంపడానికే వచ్చారు. చౌదరి యింట్లో డాగియున్నాడు. వాకిట నిలబడియున్న లక్ష్మమ్మ నిబ్బరించుకొని "కొట్టములోనికి పోయినా"దన్నది. వారు వెనుకకు తిరిగి వెళ్ళగనే తలుపులు బిగించినది. వెంటనే దొడ్డివాకిట తమ కుటుంబ వ్యవహారములు చూచే పంతులికి కబురంపినది. ఇప్పట్టున "ప్రాణవిత్తమాన భంగమందున" బొంకవచ్చునెడి శుక్రనీతిని అక్షరాలా అమలు జరిపింది లక్ష్మమ్మ. అవును మరి ! భర్త ప్రాణసంరక్షణ మప్పటి యామె ముఖ్యకర్తవ్యముగదా ? ఆమె సమయస్ఫూర్తికూడా ప్రశంసనీయమే. పంతులు రాగానే "నాయనా నా పసుపు కుంకానికి తిప్పలువచ్చినయి. మేము నడిసముద్రములో నున్నాము. ముప్పదియేండ్లబట్టి తల్లో నాలుకవలె నున్నాము. ఏమిపెట్టానో యేమిచేశానో రెండో కంటివాళ్లెరుగరు, మీ బావను ఒడ్డుచేర్చుకునే భారం నీదే"నని హృదయ విదారకంగా దుఃఖించిందామె.

ఈమె మాటలు పంతులు హృదయాన్ని ఒక్కపరితట్టినయి. లోగడ పంతులు కామెయేమి పెట్టిందో యెంత తిన్నాడో ! అంతా నెమరువేసుకోవాల్సి వచ్చింది. పంతులు మాట్లాడలేకపోయినాడు. వారికి సహాయం చేయాలనే సత్సంకల్పం గల్గింది. చేశాడు.

లక్ష్మమ్మమాట నేర్పుకు సమయస్ఫూర్తికి యీ సన్నివేశము చాలు.

ఇంకొక ముఖ్య విషయము, శీలమునుండి భ్రష్టలైన వారామె దృష్టిలో మరణించినవారి క్రిందనే లెక్క. అల్లారు ముద్దుగా జూచెడి అత్తగారిని, ఉత్తమోత్తముడైన భర్తను మోసపుచ్చి దుష్ప్రవర్తను దిగిన కోడలి నామె యెంతగా యేవగించుకున్నదో చూడండి. అందుకే "నాయనమ్మా ! మా అమ్మ యేదీ" అని మనుమడగిన ప్రశ్నకు "మీ అమ్మ చచ్చిపోయింది నాయనా" అంటుంది. లక్ష్మమ్మ ఈ మాటల్లో యెంతటి యేహ్యభావం ధ్వనిస్తున్నదో గమనించండి.

ఈమె సద్గుణాల్లో మరొక్క విశేషము. నౌకరులను యెంత ఆదరముగా చూచేదో తెలియజేసేఘట్టమొకటి పఠితల హృదయాన్ని చూరగొంటుంది. "అక్కలక్ష్మి" అనే పనిమనిషి వీరింట్లో వుండేది. ఇంటిపనులన్నియు నేర్పుగ చక్కదిద్దుచు లక్ష్మమ్మ ఆదరమునకు పాత్రమైనదామె. కొన్నేళ్లు గడిచిన తర్వాత ఆమె పనిచేయలేనిస్థితివచ్చింది. ఆమెను తొలగించి క్రొత్త నౌకరును నియమించుతానంటాడు చౌదరి. అందుకాతల్లి యేమన్నదో వినండి, "మీరిచ్చేజీతాలన్నీ మళ్ళి పోతున్నావా ? ముప్పది యేండ్లబట్టి ఒక్కతీరాన యింట్లో చాకిరీ అంతా చేసింది. అరవగావచ్చిందన్నమాటేగాని ఇంటిమనిషికన్నా యెక్కువగా పనిచేసేది. ఆ స్త్రీచర్మం మనకు ధారపోసి యిప్పుడులేచి పొమ్మంటే యెక్కడికి పోతుంది? ఈ ముప్పైయేండ్లకు జీతం కట్టియివ్వండి. రక్తస్పర్శగలవాళ్ళు కెవరికైనాయిస్తే మంచానబడ్డప్పుడు చేస్తారు" చౌదరి మరి నోరెత్తలేదు. ఆమె దృష్టిలో నౌఖరుల కన్యాయం జరిగితే చూచి సహించలేదు. ప్రభుత్వమువా రుద్యోగులకుపకారవేతనమిచ్చినట్లు తనయింట్లోపనివారు పనిచేయలేని స్థితివచ్చినపుడు వారి నుచితముగ పోషింపవలెననునది లక్ష్మమ్మ విశాలదృక్పథంలో నొకటి. ఇది మనకపూర్వవిషయముగా దోచవచ్చునుగాని లక్ష్మమ్మ విషయంలో మాత్రము "అక్కలక్ష్మి" యెడగల అవ్యాజ ప్రేమమాత్రమే. నౌకరులు తమకుచేసిన సేవకు యజమానులు వారియెందెంత విశ్వాసముంచవలెనో లక్ష్మమ్మకు తెలిసినట్లు మరెవ్వరికిని తెలియదనుట నిర్వివాదాంశము. పై సంఘటన యీ విషయాన్నే రుజువుచేస్తుంది.

తల్లివదలిపోయిన పిల్లవాడు మనుమడు "సాహు" వానినెంతో గారాబంగా పెంచింది. వాడొక్కడే వంశాని కాధారము. కాని లక్ష్మమ్మ అదృష్టం బాగాలేదు. వాడు మరణించాడు. ఇక నామె బంధాలన్నీ తొలగినట్లే భావించింది. ఈ విషయంలో లక్ష్మమ్మ హృదయమెంతగా బాధపడుతుందోనను కున్నాము. కాని శాంతమ్మతో నామె అన్నమాటలు వింటే యీమె కింతవైరాగ్యమెట్లువచ్చినదా!, యని ఆశ్చర్యమొదవకమానదు. "శాంతమ్మా నువ్వు అన్నంతినక చేసేదేమున్నది ? అహోరాత్రాలు నిద్రమాని తల్లికంటె యెక్కువగా చేశావు ప్రాప్తంతీరింది చెయ్యికడుక్కున్నావు వెనుకాముందూ తప్ప అందరము పొయ్యేవాళ్ళమే. మనం అన్నగతప్రాణాలము. వున్నంతవరకు అన్నంతినడం, నిద్రపోవడం తప్పదు గదా ? లే అమ్మా" అంటుందా సాధ్వి, ఈ మాటలతో లక్ష్మమ్మ కేవలము తాకిక వ్యవహారాల్లో జిక్కిన సామాన్య గృహిణిమాత్రమేగాదనియు, ఆత్మజ్ఞానముగల్గి, దేహమస్థిరమైనదనే సత్యాన్ని తెలిసికొని, తామరాకుపై నీటిబొట్టువలె సంసారములోనుండియు వైరాగ్య కవితయైయున్నదనియు స్పష్టమగుచున్నది.

లక్ష్మమ్మ అవసానకాలమునందు కొద్దిగానంజు చూపి, కొంచెము ఆయాసమువచ్చి, అనాయాసంగానే మరణించినదట. "మంచివాళ్ళచావు మరణకాలము నందుచూడ"మని లోకోక్తిగదా! పసుపుకుంకుమలతో, తమలపాకులతో, పూలతో శవమునూరేగింపుజేసి, మంచిగంధపు చెక్కలతో, పట్టుచీరలతో నామెను దహనంచేశారట. రామానాయుడు తల్లికితగినపుత్రుడని యదివరకే పేరుపొందాడు.

మాతృయజ్ఞాన్ని నిర్విఘ్నంగా నెరవేర్చి, పుష్కలంగా అన్న దానంచేశాడట. లక్ష్మమ్మ చచ్చికూడా అన్న సత్రాలు పెడుతున్నదని జనులక్కజముగా చెప్పికొన్నారట.

లక్ష్మమ్మకు సామ్యవాదమంటే యేమో తెలియకున్నను, ఆమె ఆచరణ అంతయు సామ్యవాద సిద్ధాంతమే. స్వభావసిద్ధముగా లక్ష్మమ్మ ఉదార స్వభావముగలది. బీదలయెడదయ, సమత్వభావము, పరోపకారపారీణత, దైవభక్తి, జ్ఞానము, కష్ట సహిష్ణుత మున్నగు తల్లి సద్గుణములే రామానాయునికి సంక్రమించినవి. సంగదాసు సహవాసము, అతని బోధలు, అతని వర్తనము కొంతదోహదమిచ్చినవే గాని నిజముగా మాతృగుణసంక్రమిత వాసనలే యతని ప్రవర్తనకు ముఖ్యకారణములు. "జిజియా" గుణములే "శివాజీ" యందుమూర్తీభవించినట్లు లక్ష్మమ్మ స్వభావములే పుత్రునియందు మూర్తీభవించినవి. లక్ష్మమ్మవంటి ఉదారులైనవారు పెక్కుండ్రున్నచో బీదసాదల సమస్యలు సులువుగా పరిష్కారమగుననుట అత్యుక్తికానేరదు. అట్టివారి యాచరణమే బహిరంగ ప్రచారముకంటె యెక్కువగాపనిచేయగలదు. అట్టియాచరణ పూర్వము గ్రామసీమలలోనుండేది. అందుచేతనే కుల మత, భేదములున్నను ద్వేషములు లేక గ్రామీణులందరు కలిసికట్టుగా నొకేకుటుంబమునకు చెందినవారివలె పరస్పరసహాయ, సానుభూతులు గల్గియుండెడివారు.

లక్ష్మమ్మను మంచి యిల్లాలుగాను, చల్లనితల్లిగాను, బీదలపాలిటి పెన్నిధిగాను చిత్రించి శ్రీలక్ష్మీనారాయణపంతులుగారాపాత్రను చక్కగాపోషించి స్త్రీలలో నట్టి సర్వసమత్వభావాంకురములు నాటి మహోపకారముచేసినారనుట అతిశయోక్తిగాదు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)

# పుష్టికరమైన సక్రమాహారం

డాక్టర్ శ్రీమతి రాజమ్మాళ్ — పి. దేవదాస్

ఇండియా వంటి దేశాలలో ప్రజానీకం ఆహార పదార్థాలకింద డబ్బు ఎక్కువ ఖర్చు చెయ్యగల స్థితిలోలేరు గనుక, పాలు, కోడిగుడ్లు, చేపలు, మాంసంవంటి ఖరీదైన ఆహార వస్తువులస్థానే, చౌకగా లభించే పుష్టికరమైన ప్రత్యామ్నాయ ఆహారపదార్థాలను అన్వేషించడం చాలా అవసరం. గేదెపాలు, ఆవుపాలకు బదులు, వేరుశనగ గింజలు పాలుతీసి దానిలో తగినంత కాడ్ లివరు ఆయిలు, పంచదార కలిపి వాడవచ్చును. పెసలు, శనగలు, మొదలైన కాయధాన్యాలు నానబోసి, మొలకెత్తిన తర్వాత తింటే, శరీరానికి తగినంత విటమిను లభిస్తుంది. మాంసమూ, చేపలూ, ఎంత పుష్టికరమైనవో, వేరుశనగ పాలనుండి తీసిన వెన్నకూడా అంత పుష్టికరమైనదని పరిశోధనలవల్ల తేలింది. చౌకగా లభించే పుష్టికరమైన ఆహార పదార్థాలు అనేకం ఉన్నాయి. మన భోజన పద్ధతులను అలవాట్లను తగువిధంగా మార్చుకున్నట్లయితే తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభం పొందవచ్చును. కొంచెం పాలు ఆహార ధాన్యాలతోగాని పప్పుతోగాని కలిపి పుచ్చుకుంటే వట్టిపాలు తాగిన దానికంటే లేదా వట్టి ఆహార ధాన్యాలు భుజించిన దానికంటే ఎంతో పుష్టికలుగుతుంది. మైసూరులోనూ, ఆంధ్ర, తమిళనాడులలోని కొన్ని ప్రాంతాలలోనూ ప్రజలు మజ్జిగ, ఆకు కూరలు రాగులు విరివిగా వాడడంవల్ల వారు ఎంతో ఆరోగ్యంగానూ, పుష్టిగానూ ఉంటారు. కాడ్ లివరు ఆయిలు అనేక వ్యాధులను నివారిస్తుంది.

గృహిణి కుటుంబంలోని వారందరికీ శరీరానికి కావలసిన ముఖ్యమైన ఆహార పదార్థాలన్నీ లభ్యమయ్యేట్టు చూడాలి. ఆరోగ్య సంరక్షణకూ; శరీర వృద్ధికీ కావలసిన పదార్థాలను మూడు రకాలుగా విభజించవచ్చును. అవి, 1. శక్తి జనకమైన ఆహార పదార్థాలు, 2. శరీర వృద్ధికి తోడ్పడే పదార్థాలు, 3. శరీరంలోని ఆయా అంగాలు సక్రమంగా పనిచేయడానికి తోడ్పడే పదార్థాలు. శక్తిజనకమైన ఆహార పదార్థాలలో ముఖ్యంగా పేర్కొనదగినవి ఆహారధాన్యాలు. ఇవి అన్ని యితర రకాల పదార్థాల కన్నా చౌకగా లభిస్తాయి. ఈ రకమైన ఆహారపదార్థాలలో బియ్యం, రాగి, గోధుమ, గంటెలు, జొన్నలు, మొక్కజొన్నలు, నానురొట్టి, సగ్గుబియ్యం కర్రపెండలం, పిండిపదార్థం సమృద్ధిగా కలిగిన బంగాళా దుంపల వంటి కూరగాయలు, పంచదార, కొవ్వు పదార్థాలు మొదలైన వాటిని చేర్చవచ్చును.

మాంస కృత్తులు శరీర వృద్ధికి తోడ్పడ

తాయి. మాంసకృత్తులు కలిగిన ఆహార పదార్థాలలో పాలు, కాయధాన్యాలు, మాంసం, చేపలు, కోడిగుడ్లు మొదలైనవి ముఖ్యంగా పేర్కొనదగినవి. పాలు, కోడిగుడ్లు చేపలు ప్రియమైనవి గనుక బీద ప్రజలు వాటిస్థానే, కాయధాన్యాలు, వేరుశనగపప్పు వాడవలసి ఉంటుంది.

దేశంలో అనేక ప్రాంతాలలో వేరుశనగపప్పు సులభంగా దొరకడమే కాక ప్రజలు దీనిని విరివిగా వాడుతున్నారు కూడా. మాంసకృత్తులు మాంసంలో ఎంత సమృద్ధిగా ఉంటాయో. వేరుశనగ పప్పులోనూ అంతసమృద్ధిగా ఉంటాయి.

ఇక మూడవ తరగతికి చెందిన ఆహార పదార్థాలు వ్యాధులను నివారించడమే కాక శరీరంలోని ఆయా అంగాలు సక్రమంగా పనిచేయడానికి తోడ్పడతాయి. అయితే ఈ రకం పదార్థాలను అంత అధికంగా వాడవలసిన పనిలేదు. ఇనుము సమృద్ధిగా కలిగిన రాగులు, ఆకు కూరలు, కాలేయము; కాల్షియముతో కూడిన ఆకు కూరలు, రాగులు, పాలు, ములగ కాడలు విటమిన్లు, సమృద్ధిగా కలిగిన ఆకు కూరలు, కూరగాయలు పాలు, కోడిగుడ్లు, కాలేయము, టొమాటోలు, నిమ్మకాయలు మొదలైనవి వ్యాధి నివారక ఆహార పదార్థాలలో ముఖ్యమైనవి.

పై మూడు రకాలకు చెందిన ఆహార పదార్థాలలోనూ రోజూ కనీసం ఒక్కొక్కరకానికి ఒకటి చొప్పున అయినా వాడాలి. రుచికి భంగంలేకుండా, సారం చెడకుండా వాటిని వండే పద్ధతులను గృహిణి నేర్చుకోవాలి. కూరగాయలను వండేటప్పుడు వీలైనంత తక్కువ నీళ్లు పోసి వండాలి. ఎక్కువసేపు ఉడకబెట్ట కూడదు, అంతేకాక కూరగాయలను వండడానికి పోసిన నీటిని ఇగరనివ్వాలేగాని వార్చి పారబొయ్యకూడదు. కారట్లు, ముల్లంగి, లెట్యూసుదోస, కాబేజి, టోమాటోలు, కొతిమేర, పచ్చిమెరపకాయలు వంటి వాటిని ఉడకబెట్టకుండానే తగు మోతాదులతో రోజూ వడ్డించాలి. వండిన ఆహారాన్ని ఆహ్లాదకరమైన వాతావరణంలో, ఉల్లాసంగా వడ్డించాలి. లేక పోతే తిన్నతిండి ఒంటికి పట్టదు.



# మనము - మన గ్రామాలు

శ్రీ గాడేపల్లి శంకరం

## మన ఇల్లూ - మన పల్లె

వ్యక్తి ఎక్కడనుంచి వచ్చాడు? ఇద్దరు వ్యక్తుల కలయికనుంచికదా ఊడిపడ్డాడు! ఈ వ్యక్తుల కలయికనే కుటుంబమనీ - సంఘమనీ అంటున్నాము. అంటే వ్యక్తికీ సంఘమునకు అవినాభావ సంబంధమున్నదన్నమాట. వ్యక్తిలేనిదే సంఘములేదు - సంఘములేనిదే వ్యక్తిలేదు. అందుచేతనే మానవుడు సంఘజీవి అన్నారు. మానవజీవితం సంఘముమీద ఆధారపడివుంది. సంఘము అభివృద్ధి చెందాలీ అంటే సంఘములోని వ్యక్తులందఱూ అభివృద్ధి పొందాలన్న మాట.

ఈ వ్యక్తులు సంఘాలుగా ఏర్పడి ఎక్కడ జీవిస్తున్నారు? ఏడులక్షల ఏభై వేల గ్రామాలల్లో జీవిస్తున్నారు. మన తెనుగుదేశానికి చెందిన పల్లెగ్రామాలు పదహారువేలు. ఈ పుస్తకం గ్రామాభివృద్ధికీ గ్రామ పునర్నిర్మాణానికీ-ఉద్దేశింపబడినది గనుక - గ్రామీణులు వ్యక్తిగతంగా - ఎంతవరకు, నిర్మాణాత్మకమైన కృషికి బాధ్యత వహించవలసి వుంటుందన్న విషయం మనము తెలుసుకోవాలి. పల్లెగ్రామాల అభివృద్ధికి వ్యక్తిఅలవరచుకొనవలసిన గుణగణాలను కూడా మనము గుర్తించవలసివుంటుంది. ఈ సుగుణ సంపత్తి యిప్పుడు గ్రామీణులలో కొఱవడిందని అనడానిక్కీలు లేదుగాని అవిద్య కారణంగా, అజ్ఞానం చేత తనకూ తన సంఘానికీవున్న సంబంధ బాంధవ్యాలు - తెలుసుకోలేకపోతున్నాడు. ఇష్టమువచ్చినట్లు స్వేచ్ఛగానైనా ప్రవర్తిస్తున్నాడు - లేదా ఒకరి పంచన బానిసయై బ్రతుకును ఈడుస్తున్నాడు- రెండూ అనర్థదాయికాలే - అందుచేత తనకుగాని- తన సంఘానికిగాని - ఏవిధంగాను ఉపయోగపడలేక పోతున్నాడు సరికదా ఒకొక్కప్పుడు తను నివసించే సంఘానికే అపచారం చేస్తున్నాడు.

కొందఱు వ్యక్తులు స్వార్థానికి తలయొగ్గుతున్నారు - మరి కొందఱు వ్యక్తులు బానిసలై బ్రతుకుతున్నారు - చాలా మంది వ్యక్తులు - నిస్పృహను - నైరాశ్యాన్ని ప్రకటిస్తున్నారు - ఇట్లా పరి పరి విధాలుగా - వ్యక్తులు-తమ జీవిత రహస్యాన్ని గుర్తించలేక - తమకూ తమ సంఘానికీ తీరని అపచారం చేస్తున్నారు. లేకపోతే ఈ నాడు పల్లె గ్రామాలు - ఇంత అధోగతిలో వుండవలసిన అవసరం ఏముంది? దుర్గుణాలైన - 'స్వార్థానికీ' - 'బానిసత్వానికీ' - నిస్పృహా నైరాశ్యాలతోగూడిన వైరాగ్యానికీ గురియై - ఈ స్థితికివచ్చినవన్నమాట.

కనుక దుర్గుణాలైన - స్వార్థము - బానిసత్వము- నైరాశ్య వైరాగ్యభావము త్యజించాలి. ఓం ప్రథమంగా పల్లెగ్రామాలలోని ప్రతి వ్యక్తి తన బాధ్యతలను గుర్తించాలి - బద్ధకించకూడదు - తనకూ తన సంఘానికీ, తనకూ తన గ్రామానికీ ఉన్న సంబంధము గుర్తించాలి. తన గ్రామానికి అభివృద్ధికరమైన మార్గాలు అన్వేషించాలి - ఆ మార్గాలు అనుసరించాలి - తనతోడి మానవులు అవి ఆచరించేటట్లు చూడాలి.

కొందఱు వ్యక్తులు కలిసి ఒక కుటుంబముగాను - కొన్ని కుటుంబములు కలిసివున్నచోటు, ఒక పల్లెగాను ఏర్పడివున్నాయి. ఒక కుటుంబములోని వ్యక్తులు ఎలా ప్రవర్తించాలో తెలుసుకోవాలి. కుటుంబములోని వ్యక్తులు ఎట్లా మసలుకుంటే - ఆ కుటుంబ గౌరవం నిలుస్తుందో - ఆ కుటుంబపోషణ సక్రమంగా జరుగుతుందో - తెలుసుకుంటేచాలు - ఈ

తాయి. మాంసకృత్తులు కలిగిన ఆహార పదార్థాలలో పాలు, కాయధాన్యాలు, మాంసం, చేపలు, కోడిగుడ్లు మొదలైనవి ముఖ్యంగా పేర్కొనదగినవి. పాలు, కోడి గుడ్లు చేపలు ప్రియమైనవి గనుక బీద ప్రజలు వాటిస్థానే, కాయధాన్యాలు, వేరుశనగపప్పు వాడవలసి ఉంటుంది.

దేశంలో అనేక ప్రాంతాలలో వేరుశనగపప్పు సులభంగా దొరకడమే కాక ప్రజలు దీనిని విరివిగా వాడుతున్నారు కూడా. మాంసకృత్తులు మాంసంలో ఎంత సమృద్ధిగా ఉంటాయో వేరుశనగ పప్పులోనూ అంతసమృద్ధిగా ఉంటాయి.

ఇక మూడవ తరగతికి చెందిన ఆహార పదార్థాలు వ్యాధులను నివారించడమే కాక శరీరంలోని ఆయా అంగాలు సక్రమంగా పనిచేయడానికి తోడ్పడతాయి. అయితే ఈ రకం పదార్థాలను అంత అధికంగా వాడవలసిన పనిలేదు. ఇనుము సమృద్ధిగా కలిగిన రాగులు, ఆకు కూరలు, కాలేయము; కాల్షియముతో కూడిన ఆకు కూరలు, రాగులు, పాలు, ములగ కాడలు విటమిన్లు, సమృద్ధిగా కలిగిన ఆకు కూరలు, కూరగాయలు పాలు, కోడి గుడ్లు, కాలేయము, టొమాటోలు, నిమ్మ కాయలు మొదలైనవి వ్యాధి నివారక ఆహార పదార్థాలలో ముఖ్యమైనవి.

పై మూడు రకాలకు చెందిన ఆహార పదార్థాలలోనూ రోజూ కనీసం ఒక్కొక్క రకానికి ఒకటి చొప్పున అయినా వాడాలి. రుచికి భంగంలేకుండా, సారం చెడకుండా వాటిని వండే పద్ధతులను గృహిణి నేర్చుకోవాలి. కూరగాయలను వండేటప్పుడు వీలైనంత తక్కువ నీళ్లు పోసి వండాలి. ఎక్కువసేపు ఉడకబెట్ట కూడదు. అంతేకాక కూరగాయలను వండడానికి పోసిన నీటిని ఇగరనివ్వాలేగాని వార్చి పారబొయ్యకూడదు. కారట్లు, ముల్లంగి, లెట్యూసుదోస, కాబేజి, టోమాటోలు, కొతిమేరు, పచ్చిమెరప కాయలు వంటి వాటిని ఉడకబెట్టకుండానే తగు మోతాదులతో రోజూ వడ్డించాలి. వండిన ఆహారాన్ని ఆహ్లాదకరమైన వాతావరణంలో, ఉల్లాసంగా వడ్డించాలి. లేక పోతే తిన్నతిండి ఒంటికి పట్టదు.



సుగుణ సంపత్తితోనే తన పల్లెనుకూడా సక్రమంగా నడిపించి - సౌభాగ్యవంతముగా చేయగలుగుతాడు. అంటే కుటుంబానికి చెందిన ప్రతివ్యక్తీ - ఆ కుటుంబ పోషణకీ - ఆ కుటుంబాన్ని క్రమపద్ధతిలో నడిపించటానికీ-గౌరవం నిలబెట్టడానికీ-ఆరోగ్యము కాపాడటానికీ. ఆనంద జీవితం గడుపటానికీ - ఎంత కృషి చేయవలసివుందో - ఎంత సహనము అవసరమో - ఎంత త్యాగం కావలసివస్తుందో - తెలుసుకుంటే చాలు - ఎవరిని ఎట్లా ఆదరించాలో - ఏవిధంగా గౌరవించాలో - ఎంతవరకూ ప్రేమించాలో-నేర్చుకుంటే చాలు. ఆడ మగ వివక్షతగాని పసిబాల వృద్ధులనే తారతమ్యంగాని-ఈ విషయంలో లేదు. కుటుంబములోని ప్రతివ్యక్తీ - ఈ విషయాలు గుర్తించవలసిందే - లేకపోతే - ఆ కుటుంబములో 'ఆనందము' వుండదు - అది క్రమపద్ధతిని నడువదు.

"ఏది తప్పు? ఎక్కడ నున్నదా తప్పు? దానిని ఒప్పుగా మార్చవలసిన విధమేది?" అని ప్రతి ఒక్కరూ కుటుంబ గౌరవంకోసం ఆలోచించి పని చేయవలసివుంది. అందులో స్త్రీలు ఎక్కువగా శ్రద్ధతీసుకొనవలసివుంది.

గృహపోషణకు కావలసిన కృషిచేయడం, క్రమశిక్షణతో వ్యవహరించడం-బాధ్యతను వహించటం-పురుషులదైతే - గృహాన్ని నిత్యకళ్యాణంగాను - పచ్చతోరణంతోనూ వుంచటం స్త్రీల వనడంలో ఏమీ సందేహం లేదు.

ఇంటనున్న స్త్రీలు క్రమశిక్షణతో నడచుకొనకపోతే - ఆ ఇంటికిగాని - ఆ పల్లెకుగాని - చివరకు ఆ దేశానికిగాని మోక్షంలేదు - అందుచేతనే - ఏది చెప్పినా - ఎంత చెప్పినా స్త్రీలకు - పిల్లలకు - విద్యాగంధములేని వయోజనులకు చెప్పవలసివుంది. శరీర ఆరోగ్య విషయంలోగాని, ఇంటి శుభ్రతలోగాని, క్రమపద్ధతులు అలవరచుకోవడంలోగాని - బిడ్డలకు నేర్పించటంలోగాని, గౌరవమర్యాదలు కాపాడుకొనటంలోగాని - అభివృద్ధిమార్గాలు అనుసరించటంలో గాని స్త్రీలే ముఖ్యంగా నేర్చుకోవాలి - స్త్రీలకు ఈ విద్య అలవడిననాడు - భావి పౌరులనదగు బాలబాలికలు కూడా బాగుపడుతారు. తాము ఎంత ఆరోగ్యవంతులుగా వుంటారో - తమ ఇంటిని అంత ఆరోగ్యవంతముగా వుంచుతారు - తమ ఇంటిని ఎంత ఆరోగ్యవంతముగా వుంచుకొంటారో - తమ పరిసరాల్నీ పల్లెనీ కూడ అంత ఆరోగ్యవంతముగా వుంచగల్గుతారు. తమ ఇంట ఎటువంటి క్రమపద్ధతులు అలవరచుకుంటారో - వారి పల్లెలో అంత సక్రమంగా నడుచుకుంటారు. వారి కుటుంబ పోషణకి ఎంత కృషి చేయగలుగుతారో - వారు గ్రామాభివృద్ధికి అంత పాటుపడుతారు. వారి కుటుంబగౌరవమును నిలబెట్టుకొనుటకు ఎంత సహనము, త్యాగము, ప్రేమ అలవరచుకుంటారో-వారు గ్రామనాయకులై అంతటి కీర్తిప్రతిష్ఠలు ఆర్జించుకుంటారు.

ఉదయాన్నే లేవడం., నిర్ణయించిన ప్రదేశంలో కాలకృత్యాలు తీర్చుకోవడం, స్నానం చేయడం - క్రితం ఊతికి ఆరవేసిన బట్టలు వేసుకొని-దేవుడిచ్చిన కలో గంజియో త్రాగి పనిమీదకు పోవడం మొగవాడు చేయవలసిన పని.

లేచీ లేవడంతోనే కాలకృత్యాలు తీర్చుకొని - ఇంటినీ వంటినీ కూడ శుభ్రంచేసుకొని - మొగవానిని పనిమీదకు పిల్లల్ని బడిలోనికి పంపించి ఇంటిపనులలో జొరబడటం ఇల్లాలిపని. వృద్ధులైన అత్తమామలకు సేవచేస్తుంది. అడపాదడపా వచ్చిపోయే బావమరదులను తోటికోడళ్ళను ఆదరిస్తుంది. కష్టంవచ్చినా కరువు కాటకాలు వచ్చినా ధైర్యంతో ఎదుర్కొంటుంది. ఇరుగుతోను పొరుగుతోను సహనభావంతో సంచరిస్తుంది. ఎంత త్యాగానైనా చేసి కుటుంబ గౌరవాన్ని నిలబెట్టుతుంది. ఆమె గుణాలే ఆమె పిల్లలు తమకు తెలియకుండా నేర్చుకుంటారు.

ఆ ఇంటిలోనివారందరూ ఆ గృహయజమాని చెప్పినట్లు నడుచుకుంటారు. ఆయన మాటకు ఎదురు చెప్పరు. ఆయన కూడా తన భార్యను ప్రేమిస్తాడు. తన పిల్లలను లాలిస్తాడు-తల్లిదండ్రులను గౌరవిస్తాడు- అన్నదమ్ములను ఆదరిస్తాడు - పగలంతా చమటోడ్చి

పనిచేసి తన చెంతచేరినవారినందరినీ పోషిస్తాడు. కష్టానికి ఓరుస్తాడు-ఆశాభంగాలకి అధైర్యపడడు. ఆశయం సిద్ధించేవరకూ దీక్షతో కృషిచేస్తాడు - తన విధులను తాను నెరవేర్చటంలో ఎంతమాత్రం ఏమరుపాటు చెందడు. సోమరితనంగాతడు వుండడు - తన ఇంట్లో ఎవ్వరినీ ఉండనీయడు - ఇంటనున్న వ్యక్తులయందు అతడు నిష్పక్షపాతంగా వ్యవహరించటంచేత అందరూ అతనిని గౌరవిస్తారు—ఏ సమయంలోనైనా ఒకానొక వ్యక్తియందు అవసరమునుబట్టి ఎక్కువ శ్రద్ధ చూపించినా—ఇంటిలోని వారెవ్వరూ కించపడరు. ఐకమత్యంతోను — క్రమశిక్షణతోను నడుచుకునే స్వభావం వాళ్లు అలవాటు చేసుకున్నారు.

తమవ్యక్తి స్వాతంత్ర్యాన్ని భావస్వాతంత్ర్యాన్ని వారు ఎప్పుడూ వదులుకోలేదు. కుటుంబ శ్రేయస్సుకై వారి తీసే విషయాలను గురించి వాళ్లు స్వతంత్రముగా ఆలోచిస్తారు — కోరినప్పుడు తమ అభిప్రాయాలను స్వేచ్ఛగా గృహయజమానికి చెప్పనూగలరు. అయితే తమ కుటుంబ పెద్ద నిర్ణయించి చేసే పనికిమాత్రం ఎప్పుడూ అడ్డుచెప్పరు—పైగా అంతా తలయొగ్గి—ఇష్టంవున్నా లేకపోయినా—సహకరిస్తారు.

గృహయజమాని కూడా అత్యవసరమైన విషయాలలో, యుక్తవయస్సు వచ్చిన స్త్రీపురుషులను సంప్రదించకుండా వుండడు—అందరినీ ఒకచోట చేర్చి అడుగనూవచ్చు లేదా విడివిడిగా అడిగి తెలుసుకోనూ వచ్చు. ఇంట్లో వున్నవారందరూ—తాము స్వతంత్రులమనీ అది తమ ఇల్లు అనీ—ఆయన తండ్రి అనీ—ఈమె తల్లియనీ-వారు తమ శ్రేయోభిలాషులనీ విశ్వసిస్తారు, వారి మాటను శిరసావహిస్తారు. వారిని ప్రేమిస్తారు-గౌరవిస్తారు—ఇందులో ఏదైనా తమకి తృప్తికరంగా లేకపోయినప్పటికీ — కుటుంబగౌరవమే ప్రధానమైనప్పుడు—తమ స్వసుఖాన్ని త్యాగంచేస్తారు. ఇదీ వారి కుటుంబంలోని వ్యక్తుల స్వాతంత్ర్యము ఐకమత్యము.

అది పేదకుటుంబమే—అయినా శుచి శుభ్రతలకు ఏమీ లోటు చేసుకోరు—వారికి బద్ధకంలేదు—శ్రద్ధ యెక్కువ. అది పూరిగుడిశ—అవి మట్టిగోడలే అయినా పేడా మన్నూతో మెత్తి—గోడలకి సున్నంవేశారు. నేల నున్నగా అలికి ముగ్గులు పెట్టారు. అవి వెదురు బొంగులతో చేసిన కిటికీలే సుమండీ! వీధిలోకి గుమ్మానికి ఇరుప్రక్కలా కనబడుతున్నాయి. గాలి వెల్తురులు ఆ ఇంటిలోకి బాహాటంగా వస్తున్నాయి—ఇల్లు కూడా ఎత్తుగానే కొంచెము మట్టి దిమ్మవేసి కట్టుకున్నారు. ముందు ఖాళీస్థలంలో పూలమొక్కలు పెంచారు—వెనుక కూడా చిన్న పెరడువుంది—ఓమూలగా దక్షిణ భాగాన్ని పశువుని కట్టుకున్నారు—దానికి వేసిన ఆ చిన్నపాక ఎంతోశుభ్రంగావుంది. ఈ పాకకికొంచెము ఇవతలగా కక్కుసువుంది—ఇంటికి ఈశాన్యభాగంలో భావి—భావిచుట్టూ బాడీబందా లేకుండా వాడకపు నీళ్ళన్నీ—ప్రక్కనే వున్న పాదుల్లోకి ఎలా పోతున్నాయో—పేడ కుప్పలు పెంట కుప్పలు పొలానికి ఎరువుగా ఉపయోగిస్తారు. చింపిపోసిన కాగితం ముక్కలు, తిని పారేసిన పండ్లతొక్కలు, చినిగిపోయిన గుడ్డపేలికలూ ఎక్కడా కనబడటంలేదు—వీధిలో వుంచిన తుక్కు డబ్బాలోనికో—పెరడులో త్రవ్వి వుంచిన గోతిలోనికో తుడిచి పారేస్తారు కాబోలు! ఈగలు దోమలు ముసరటంలేదు—ఆ నిరుపేదల ఇల్లు ఎంత అందముగా వుందో—అంత ఆరోగ్యముగావుంది. వారి ఇల్లు ఎంత ఆరోగ్యంగా వుందో ఆ ఇంటిలోని వారంతా అంత ఐకమత్యంతోటి క్రమశిక్షణతోటి మసలుకుంటున్నారు.

ఆ పల్లెలోని పూరి గుడిశలన్నీ ఈ విధంగానే—బారులుతీర్చి కట్టుకుంటూ వీధులుగా ఏర్పరచుకుంటే ఎంత అందంగా వుంటుంది! ఆ పల్లెవాసులందరూ ఒక ఇంటిలోని వ్యక్తులవలె ఐకమత్యంతో మెలగుతూ గృహయజమానివలె గ్రామపంచాయితీని గౌరవిస్తే వారి సంఘజీవితం ఎంత సంతోషప్రదంగా వుంటుంది? వారి గ్రామజీవితం ఎంత ఆరోగ్యవంతముగా వుంటుంది? ఇటువంటి పల్లెగ్రామాలు వెలసిన భారత దేశం ఆహా ఏనాటికి ఏర్పడుతుందో కదా!

—o—

(256—వ పేజీ తరువాయి)

"అరువదినాలుగు కాలణాలతో
అమరునుగద ఒక రూపాయి
అయితే వందా ఇరువది యెనిమిది
నయాపైసలా రూపాయకు ?"

పంతులయ్యా తలగోకుకొనుచును
పట్టువదలక చెప్పారు
"పాతలెక్కలు మారిపోయెను
క్రొత్తవాటిని నేర్వండి.

జంటకార్డు పదినయాపైసలు
జాగ్రత్తగా తెలియండి
తొమ్మిది నయాపైసలే ఇన్‌లాండ్ కవరు
తొందరపడక తెలియండీ."

నళినీ తెంపుగ లేచి నిలబడి
నవ్వుతు అడిగెను పంతులను
"జంటకార్డు, ఇన్‌లాండుకవరు
ఒకటన్నరణాగా వెలజూస్తే !

నయాపైసలలో తేడావుందే
న్యాయమ పంతులు తెల్పండి ?"
"పాతలెక్కలు మారిపోయెను
కొత్త లెక్కలు నేర్వండి."

# దండనాతీతం

శ్రీ కప్పగంతుల రామకృష్ణ ప్రసాద్

ఫ్రెంచిదేశము, ఇటలీదేశము కలిసేచోట ఒక చిన్న రాజ్యంవుంది. అది ఎంత చిన్న రాజ్యమంటే మరి అంతకన్న చిన్న రాజ్యాలు వేరే లేవనడంలో ఏమంత ఆశ్చర్యంలేదు. దాని జనసంఖ్య మొత్తం ఏడువేలు. కాని ఈ బుల్లి రాజ్యానికికూడ ఒక బుల్లిరాజు, మంత్రులు, న్యాయవాదులు, సేనలు అన్ని వున్నాయ్. ఆ రాజ్యంలోగూడ గుళ్ళు, గోపురాలు, భవనాలు ఎక్కువో తక్కువో కొద్దిగా వున్నాయ్. ఈ రాజ్యంపేరు మొనాకో.

ఆ రాజ్యానికి ఆదాయం వచ్చేదానికి ఆధారాలు లేవు. ఎందుకంటే, ప్రజలు తక్కువమంది, అదీగాక ఏపన్ను వసూలుచేయవలెనన్నా పన్ను వసూలు చేసేవానికికూడా గిట్టుబాటుకాకపోయె. ఆ దేశానికి వున్నదల్లా ఒకే విధమైన ఆదాయం. జూదం ఆడేవారిపైన పన్నులు విధించడమే. జూదమువల్ల అనవసరంగా కలహాలు వృద్ధిచెంది నేరాలు చేస్తారని తక్కిన దేశాలన్ని జూదాన్ని ఒక నేరంగా పరిగణించాయ్. కాని మొనాకో రాజ్యంమట్టుకు జూదం ఆడ్డానికి వసతులు ఏర్పరిచింది. అందుగ్గాను బయటి దేశాలవారుకూడా అప్పుడప్పుడువచ్చి జూదమాడి వెళ్ళేవారు.

ఇలా వుండగా ఒక్కసారి ఎవరో ఒకడు ఆడ్డానికొచ్చి కోపావేశంలో ఇంకొకణ్ణి చంపేశాడు. అంతవఱకు ఆ దేశంలో ఎవ్వరూ హత్యను గురించి వినకపోవడంవల్ల ఇదేదో కొత్తగా కనిపించిందివారికి. కాని దీన్ని పెద్ద నేరంగా వారందఱూ ఊహించారు. న్యాయాధిపతులంతా సమావేశమై నేరస్థునికి మరణదండన వేయాలని తీర్మానించారు.

అక్కడే వచ్చింది సమస్య. ఇంతవఱకూ ఇలాంటి నేరం చేయకపోవడంవల్ల వారికి ఉరికంబంతో పని లేకపోయింది. ఇప్పుడు నేరస్థుని ఎలా వురితీయాలి అని వారు తర్కించుచున్నారు. కడకు ప్రక్కనే వున్న ఫ్రెంచివారియొద్ద ఒక ఉరికంబాన్ని ఉరితీసే మనిషిని కొనాలని తీర్మానించుకున్నారు ఊరిపెద్దలు. ఫ్రెంచివారు పద్దెనిమిదివేల రూపాయల కిస్తామని ఒప్పుకున్నారు. అంత ధనం ఇవ్వాలంటే వారికి

మనసొప్పిందికాదు. వారి దేశంలోని ప్రతి ఒక్కడూ తలకొక రెండు రూపాయలు ఇచ్చినా అంత ధనం వసూలుకాదు. ఇటలీవారి నడిగితే కొంత చౌకగా లభిస్తుందేమోనని వారినిగూడా అడిగారు. ఇటలీ వారు పన్నెండువేలకే ఇస్తామన్నారుకాని అదికూడా పెద్ద మొత్తంగానే కనబడింది మొనాకో ప్రజలకి.

చివరికి నేరస్థునికి శిక్ష తగ్గించాలని అనుకున్నారు. న్యాయవాదులంత కూడి ఈ సారి వానికి ఆమరణ కారాగార శిక్ష విధించాలని తీర్మానించారు. నేరస్థుని ఒక కారాగారంలోవేసి వానికి కాపలా వుంచారు.

కాని కొన్నాళ్ల తర్వాత లెక్కల్నిబట్టి వాని ఖర్చు అప్పటికే చాల ఎక్కువైనట్టుగా తేలింది. దీన్నిబట్టి ప్రభుత్వానికి అత్యధికంగా ఖర్చవుతుందని వారు అంచనావేశారు. రాజుకు ఈ నేరస్థుని విషయంలో తగని చికాకు వేసింది. ఎటొచ్చినా వీనితో చిక్కుగానేవుంది. అందుకని వాణ్ణి వదిలేయమని ఆజ్ఞయిచ్చి కాపలావాణ్ణి తీసేశారు.

పాపం ఆ నేరస్థుడు తనకు వేళకు ఆహారం రాకపొయ్యేసరికి వాకిలి తీసుకొని నేరుగా రాజుగారి వంటశాలకువెళ్ళి తన భాగానికి రావలసిన ఆహారము తీసుకొని జైల్లోవచ్చి కూర్చున్నాడు. వదులుకుందామన్నా పీలులేకపొయ్యేసరికి రాజుగారికి కోపం వచ్చింది. తామే స్వయంగా జైలుకొచ్చి "శిక్ష రద్దుచేసి నిన్ను వదిలేసినా నీవు యెందుకు వెళ్ళ లేదు ?" అని ప్రశ్నించారు.

"ప్రభూ! నన్ను హంతకునిగా తాము తీర్పుచెప్పిన తర్వాత ప్రజలు నన్ను ఏవగించుకుంటున్నారు. అదీగాక ఇంతకాలం జైలులోవుండి ఇప్పుడు నాకు పని చేయాలని బుద్ధి పుట్టడంలేదు. మీరు నాకు మరణ శిక్ష విధించి నన్ను చంపేసినా బాగుండేది. పోనీ! చంపకపోయినా చచ్చేంతవరకు జైల్లో వుండనివ్వకపోతే నేనెలా బ్రతికేది! కావున తాము దయచేసి నాకు చచ్చేంతవరకు భరణమివ్వాల్సిందిగా కోరుతున్నాను" అంటూ వినయంగా జవాబిచ్చాడు. వాని జవాబు రాజుగారికి సబబుగాతోచి "వానికి నెలకు యాభైరూపాయల చొప్పున భరణమిచ్చేలాగుననూ, వాడు ఆ దేశంవదలి ఇంకెక్కడైనా వుండాలనీ" తీర్పు చెప్పారు.

ఈ విధంగా వాడు హత్యచేసినా బతుకున్నంతకాలం రాజుగారిచ్చే భరణంతో మొనాకోదేశం ప్రక్కనే ఒక భూమి కొనుక్కుని పంట పండించుకుని సుఖంగా జీవించిన ఆ కాలంలో నేరం ఎలా చేయాలో ఎలా దండించాలో తెలియలేదంటే నిజంగా ఆశ్చర్యం వేస్తుంది.





కీ॥ శే॥ శ్రీమతి యామినీపూర్ణ తిలకమ్మ

సుప్రసిద్ధ సంఘసేవకురాలు, విదుషీమణి, రచయిత్రి - ఈమె
నిర్విరామ సేవాసక్తి అశేషమహిళాలోకమునకు
మార్గదర్శకమయినది.




**మాలతి : శ్రీ పులిపాక జగన్నాధరావు, ఆంగ్లభాషాశాఖ, హిందూ కళాశాల, గుంటూరు, వెల 0-4-0.**

ఈ 24 పేజీల చిన్న పుస్తకంలో నిర్మల మాలతి శీర్షికలతో రెండు కథలున్నవి. ఇందులో యువకుల మనస్తత్వాలను చిత్రిస్తూ ఆదర్శనీయమైన జీవితమును ప్రబోధిస్తున్నది.

మొదటి కథలో ఒక యువకుడు తాను బీదవాడైనా జమీందారు కుమార్తె నిర్మల సౌందర్య లావణ్యాలకు ముగ్ధుడై తాను ఆమెను చేబట్టడానికి ఆమె సానుభూతి, సద్భావములను సంపాదించి, విశాల హృదయుడైన ఆమె తండ్రి సమ్మతితో వివాహమాడ కలిగాడు.

మాలతి ఒక యింట్లో పరిచారిక అయినా ఆమె సౌందర్యమును చూచి తాను ఆమెను వివాహమాడెదనని, అందుకు తల్లిదండ్రుల సమ్మతి సయితం కలదని నమ్మించి ఆమె మానాభిమానాన్ని హరించి, ఆమె చూలాలు కాగానే ఆమెను ఏవగించుకుంటూ దురలవాట్లకు, దురభ్యాసాలకు గురియైనాడు. అది తల్లిచూచి కుమారుని మందలిస్తూ దూరదేశాలకు వెళ్ళి వివాహం చేసికొని సుఖపడమని ప్రోత్సహించి పంపింది. వారిద్దరికి వివాహమయింది; పండువంటి మగబిడ్డ పుట్టాడు; కాని ఆమె మాత్రం యీ లోకానికి దూరమయింది. యువకుడు మాత్రం తాను సయితం కనుమూసి గగనాన ప్రేయసిని కలిసేదెన్నటికో అని ఎదురుచూస్తుంటాడు.

ఇట్టి కథలు దయాదాక్షిణ్యాలను, సానుభూతి సద్భావాలను, విశాల హృదయాన్ని ప్రోత్సహించి, మానవుల నైతిక స్థాయి పెరుగుటకు తోడ్పడునవి. ఈ సందర్భమున రచయిత అభినందనీయుడు. కథల నడక సరళంగా, ఉత్సాహవంతంగా నున్నది.

**నవగీతాలు: ఉభయభాషాప్రవీణ జాస్తి వేంకటనరసయ్యగారు. ప్రచురణ కర్తలు: భారతీసమితి, పామర్రు, కృష్ణాజిల్లా,**

ఇందులోని గీతాలు మృదువైన భావలో రసపూరితంగానున్నవి. ప్రస్తుతము సంఘస్వరూపాన్ని చిత్రిస్తూ, జాతీయతను ప్రబోధించుచు పండిత పామరులందరికి పాఠ్యయోగ్యంగా నున్నవి.

**ప్రజారాజ్యము : ఉభయభాషాప్రవీణ జాస్తి వేంకటనరసయ్య. విద్వాన్ ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యముగారలు. ప్రకాశకులు : లక్ష్మీహిందీ విద్యాలయము, చిలకలూరిపేట, గుంటూరు జిల్లా. వెల 1-0-0,**

ఇందులో ప్రజారాజ్యము, ఉపాధ్యాయుడు అనే రెండు నాటికలు కూర్చబడినవి. మొదటిది సామ్యవాద నాటిక. ఇందులో కష్టజీవుల కడగండ్లు, సంపన్న భూస్వాముల దౌర్జన్యదుర్మార్గములు చిత్రించడంతో పాటు ప్రజలలో చైతన్యము పూరించవలసిన విధానము సయితము ప్రబోధించబడింది.

రెండవది ఉపాధ్యాయ ఏకపాత్ర నాటిక. ప్రస్తుతపు ఉపాధ్యాయుని దీనావస్థ, చాలీచాలని ఆదాయంతో అతను ఎదుర్కొనే దైనందిన సమస్యలు యీ చిన్న నాటికలో కండ్లకు కట్టినట్లు చిత్రించబడినవి.

ఈ రెండు నాటికలు పాఠ్యయోగ్యములే కాక ప్రదర్శనాయోగ్యములు కూడాను.

# సంపాదకీయములు

## అభినందనలు

ఈ మధ్య జరిగిన ఎన్నికల ఫలితాల దృష్ట్యా కేంద్ర, రాష్ట్రములలో ఏర్పడిన నూతన మంత్రివర్గములతో బాటు భారత రాష్ట్రపతిగాను, ఉపరాష్ట్రపతిగాను డాక్టర్ రాజేంద్రప్రసాదు, డాక్టరు యస్. రాధాకృష్ణన్ గారలు ఎన్నికయయినందుకు అభినందనీయులు. వీరిరువురు జాతీయవాదులు, విజ్ఞతా విజ్ఞాననిధులు, విశాలదృక్పథము, ఉత్తమోత్తమ ఆదర్శలక్ష్యవాదులు. సంకుచిత కుల,మత, వర్గ, భాషా, పార్టీ తత్వాలకతీతులు కాబట్టే యావద్భారత దేశం వీరికి అజాతశత్రువులుగా జోహారులర్పిస్తున్నది. ప్రజా పురోభివృద్ధిపట్ల, శాంతి సౌభాగ్యముల పట్ల, జాతీయ వైజ్ఞానిక సంస్కృతులపట్ల వారి ఆసక్తి అపారము, కాబట్టే తాము ప్రమాణము స్వీకరించగానే ప్రథమపార్లమెంటు సమావేశంలో అణ్వస్త్రాలపాటవ పరీక్షలు నిలుపాలని రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారు అగ్రరాజ్యాలకు విజ్ఞప్తిచేశారు, ఉపరాష్ట్రపతి రాధాకృష్ణన్ గారు రానున్న అయిదు సంవత్సరములలో పటిష్టమైన జాతీయనాయకత్వ నిర్మాణము యొక్క ఆవశ్యకతను నొక్కి వక్కాణించారు.

ఈనాడు కేంద్రములోను, రాష్ట్రములలోను మంత్రిపదవుల నలంకరించిన అనేకులు రాష్ట్రపతిని, ఉపరాష్ట్రపతిని ఆదర్శంగా తీసికొనినచో ప్రభుత్వనిర్వహణలో చిత్తశుద్ధి, పటిష్టత, సమరస సద్భావములు, విశాల దృక్పథం పెంపొందగలవు.

ఇండియా ప్రధానమంత్రి పండితజవహర్లాల్ నెహ్రూ, రాష్ట్రపతి,ఉపరాష్ట్రపతుల ప్రభావము, మంత్రి వర్గాల సభ్యుల సేవాత్యాగాలను, ప్రజాహితము పట్ల ఆసక్తిని పెంపొందించి ప్రజాదరాభిమానములకు పాత్రులుగా చేయగలవనియు, అభ్యుదయ అభివృద్ధులతో బాటు శాంతి సౌభాగ్యాలు సయితము సుస్థిరము కాగలవని ఆశిద్దాం !

## చేనేత పరిశ్రమ

చేనేతపరిశ్రమ భవిష్యత్తు ఎంతపారజూచినా ప్రకాశవంతంగా కనుపించుటలేదు. చేనేత పూర్వ నైపుణ్యవైభవాలనుగురించి పెద్దలు ఉపన్యసిస్తుంటారు. చేనేత పరిశ్రమ ఉద్ధరణకని ప్రభుత్వము ధనము కేటాయిస్తుంటుంది. అవసరమయితే పరిశ్రమ ప్రోత్సాహానికంటూ అప్పులను సయితం మంజూరుచేయ కేంద్ర రాష్ట్రప్రభుత్వములు తలపెట్టుటగమనించతగినది.

ఈనాటి చేనేత పరిశ్రమ అభివృద్ధి ప్రణాళికలు దానిని కుటీరపరిశ్రమగా నిలబెట్టాలనా ? లేక క్రమంగా యంత్రపరిశ్రమగా మార్చాలనా అనేది యోచింపతగినది,

చేనేత పరిశ్రమ చేతిపరిశ్రమగా నిలబడాలంటే పవర్ మగ్గాలు ఎంతమాత్రం అవసరమో తర్కించ తగినది. పవర్ మగ్గాలమూలంగా పనినులభం కావచ్చు; గుడ్డనాణ్యత పెరుగవచ్చు; కాని యీనాటి చేనేత పారిశ్రామికులలోని నిరుద్యోగాన్ని, ఆర్థికదుస్థితిని తొలగించగలవా ?

చేనేత పరిశ్రమకు యీనాడు సయితం ప్రాముఖ్యతయున్నదంటే గుడ్డనాణ్యమే కారణం. ప్రవీణతలో తయారయే గుడ్డకు యీనాడు సయితం లోటులేదు. కాని మిల్లుగుడ్డ పోటీనుండి రక్షణకల్పించినచో చేనేత పూర్వవైభవాన్ని అందుకోగలదు. చేనేతనూలుకొరత యీనాటి పరిశ్రమదుస్థితికి కారణము కాదు. తయారయినగుడ్డ దేశంలోను, బయటకూడ లాభదాయకంగా విడుదలకు అవకాశములమరినచో చేనేత సమస్యలు చాలవరకు పరిష్కారమయినట్లే కాగలదు.

# శ్రీ హేవళంబినామ సం॥ర వైశాఖ, జ్యేష్ఠమాసములు

| | | | |
|---|---|---|---|
| 1957 సం॥ మే నెల | 16 | గు | త 53-1 జ్యే 13-37 త్యా 4-13 |
| | 17 | శు | చ 55-5 మూ 16-38 |
| | 18 | శ | పం 58-9 పూషా 20-42 |
| | 19 | ఆ | ష 60-10 ఉషా 25-38 |
| | 20 | సో | ష 2-5 శ్ర 31-11 సిద్ధియోగం |
| | 21 | మం | స 6-22 ధ 37-7 అమృతయోగం |
| | 22 | బు | అ 10-53 శత 43-10 |
| | 23 | గు | న 15-20 పూభా 49-2 |
| | 24 | శు | ద 19-29 ఉభా 54-31 హనుమజ్జయంతి |
| | 25 | శ | ఏ 23-22 రే 59-18 శూన్యతిథి |
| | 26 | ఆ | ద్వా 25-47 అశ్వ 60-10 దగ్ధయోగం |
| | 27 | సో | త్ర 27-22 అశ్వ 2-57 మాసశివరాత్రి |
| | 28 | మం | చతు 28-7 భ 5-41 |
| | 29 | బు | ● అమా 27-28 కృ 7-14 |
| | | | **జ్యేష్ఠమాసము** |
| | 30 | గు | శుపా 25-34 రో 7-35 |
| | 31 | శు | విది 22-28 మృ 6-43 తిథిద్వయం |
| 1957 సం॥ జూన్ నెల | 1 | శ | త 18-17 ఆర్ద్ర 4-44 రంభాగౌరివ్రతం |
| | 2 | ఆ | చ 13-12 పున 1-47 పుష్య 56-23 ఉమావ్రతం |
| | 3 | సో | పం 7-22 ఆశ్రే 53-52 |
| | 4 | మం | ష 1-1 ఏవ్యం 50-23 |
| | 5 | బు | అ 47-48 పూఫ 44-35 |
| | 6 | గు | న 41-32 ఉఫ 40-18 త్యా 3-46 |
| | 7 | శు | ద 35-57 హ 36-35 |
| | 8 | శ | ఏ 30-56 చి 33-31 |
| | 9 | ఆ | ద్వా 26-59 స్వా 31-39 రామలక్ష్మణ ద్వాదశి |
| | 10 | సో | త్ర 24-9 విశా 30-52 త్యా 5-2 |
| | 11 | మం | చతు 22-31 అనూ 31-13 తిథిద్వయం |
| | 12 | బు | ○ పౌ 22-9 జ్యే 32-5 సావిత్రీవ్రతం |
| | 13 | గు | కృపా 22-59 మూ 35-35 |
| | 14 | శు | వి 24-55 పూషా 39-25 త్యా 4-16 |
| | 15 | శ | త 27-50 ఉషా 44-9 త్యా 4-19 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏ మాసమునుండి యైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లై కార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

Lodhra Press, Madras-14.